పుట్టుఁ గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమకారుణికత్వమహావిభూతికిన్.

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనా
భ్యర్చిత మైనభారత మపారకృపాపరతంత్రవృత్తి మైఁ
జేర్చినదేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్.

ఇది యనన్యసామాన్యం బగుపరమధర్మప్రకారంబు.

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్కృతి
శ్రీవిభవాస్పదం బయినచిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."

ఈ పైయవతారికలోని స్వప్నవృత్తాంతమును మనము చక్కఁగాఁ బరిశీలించువార మగుదుమేని తిక్కనసోమయాజి స్వాభిప్రాయప్రకటనము నెంతప్రౌఢముగాఁ జేసియున్నాఁడో స్పష్టము గాక మానదు. ఈస్వప్నవృత్తాంత మీతనికిఁ బితృభక్తి విశేషముగాఁ గల దని తేటపఱుచుచున్నది. తనపితృభక్తిని లోకమునకు వెల్లడించుకొఱకే స్వప్నవృత్తాంతమును జొప్పించినాఁడు. తిక్కనతండ్రి కొమ్మనామాత్యుఁడు తిక్కనబాల్యముననే మృతినొందియుండును. తిక్కన యిట్టిపవిత్ర మైనభక్తిని జూపుట కదియే కారణ మైయుండు నని నాయభిప్రాయము. ఇందు హరిహరనాథునిస్వరూపము నెంతో చక్కఁగా వర్ణించియున్నాఁడు. దేవునకును దనకును నడుమను దన తండ్రిని బ్రవేశపెట్టి వానిమూలమున దేవునిఁ బ్రత్యక్షము గావించుకొని "కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ" అని యతఁడే కావ్య మంకితము చేయు మని యడిగినట్లుగాఁ జెప్పినది ప్రౌఢముగా నున్న దనుటకు సంశయము లేదు. తిక్కనసోమయాజి తనకుఁ గలవైదిక మార్గనిష్ఠ మగువర్తనమును, హరిహరులయెడ భేదము లేక సమభక్తిఁ

గలిగియుండుటయును, స్మరియించి తదుభయసగుణమూర్త్యధిదేవత యగుహరిహరనాథునియెడఁ దన కుండు నిరంతరభక్తితోఁ గూడు కొన్నయాత్మానందానుభవమును లోకమునకుఁ దెలిపినవిధము మిక్కిలి ప్రౌఢముగా నున్నది. భారతము పంచమవేద మని ప్రసిద్ధిఁ జెందినగ్రంథ మగుటచేతఁ దానిం దెనిఁగించునపుడు దనకును దనవంశ మునకును గలశ్రేష్ఠత్వమును, దేవతాభక్తి మొదలగువానిని బ్రక టింపకయున్నచోఁ దనగ్రంథము సర్వజనాదరణపాత్రము గా దనుతలం పుతో సోమయాజి స్వకీయశిష్టత్వమును బ్రకటించుకొనె నని కవి జీవితగ్రంథకారుఁడు సూచించెను. ఇదియే నిజమైనయెడలఁ దిక్కన వైదికమార్గనిష్ఠ మగుప్రవర్తనము కల్ల యని తేటపడఁగలదు. అభి నవదండి దశకుమారచరిత్రమునఁ దిక్కననుగూర్చి చేసినవర్ణనము తిక్కనసోమయాజి చెప్పుకొన్నవైదికమార్గనిష్ఠ మగువర్తనము కల్ల గాక సత్యమైనదే యని వేనోళ్ల బుజువు చేయుచున్నది. కాని యా కవిజీవితగ్రంథకారుఁడే మఱియొకచోట,

"కాని స్వప్నములను నమ్మి వానిని గ్రంథస్థముఁ జేసినయాంధ్రకవులలో నీతఁడే మొదటివాఁడు. భగవదుపాసనాపరులకుఁ దన్మూలముగ నంతఃకరణపరిపా కము గలిగి యిట్టిభగవదనుగ్రహసూచకస్వప్నంబు లగుటయు విశేషమహాత్తులు లభ్య మగుటయు నైసర్గికములే యని యాస్తికులకు విశేషించి చెప్పవలసినది లేదు. సోమయాజియు నట్టియుపాసనాబలంబున విజ్ఞానసంపన్నుఁడై భారతరహస్యార్థ ములఁ దెలిసికొని వేదముం బ్రకటించినచతురాననప్రతిష్ఠ నందియుండె నని చెప్పు టకు సందియము లేదు. * * * * సోమయాజికి వేదాంతాదిశాస్త్రములందును, సాంఖ్యయోగాదిశాస్త్రములలోపలను గలవిశేషపాండిత్యము శాంత్యానుశాసనిక పర్వములవలనను దక్కినపర్వములలోఁ దత్త్వముం జెప్పెడునితిహాసాదులవలనం గోచరంబులు గాఁగలవు. పూర్వోత్తరమీమాంసాశాస్త్రము లెంతయు నేర్చిన వాఁ డని సోమయాజి జైనపండితులతోఁ జేసినసంవాదాదికమువలనం గోచరం బగును. అట్టివానివివరములు గ్రంథస్థములు గాకున్న నట్టిసంవాదములవిషయము మాత్రము సోమదేవరాజీయము మొదలగుగ్రంథములలోఁ గొంత వివరింపఁబడి యున్నదాని నే నీవలకే ప్రకటించితిని."

అని వ్రాసియుండెను. ఇన్ని శాస్త్రములు చదువుకొని యిన్ని సాంప్రదాయములు తెలిసియుండి యింతవిజ్ఞానసంపన్నుఁడైన వేదవేత్త యాకాలమున వైదికమార్గనిష్ఠ మగువర్తనము గలిగియుండె ననుట యవిశ్వాసపాత్రము గాదు. వేదాంతతత్త్వరహస్యంబులు, చిదచిద్వివేకంబుల ధర్మాధర్మంబులు, రాజనీతిప్రకారంబులు, భారతవీరుల ప్రభావంబులు మొదలుగాఁగల భారతార్థముల నాంధ్రావలి మోదముం బొరయునట్లుగాఁ దెలిపి యాంధ్రప్రపంచము నుద్ధరించుటయె తిక్కన సోమయాజిమనఃసంకల్ప మైయుండెను. అందుకొఱకే యామహానుభావుఁడు మహాకవిత్వదీక్షావిధిని బూని సాత్త్వవతేయసంస్కృతి శ్రీవిభవాస్పదం బయినచిత్తముతో 'నీయాదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషంబుగాఁ దలంచి'

"క. హరిహరనాథునకు మరు
త్సరిదాకల్పితమనోజ్ఞచరణశిరస్సుం
దరమూర్తికి భావనత
త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్."

తాను 'విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేయు'వాఁడై,

"క. జలనిధిహిమవద్భూధర
కలితజననకేళికౌతుకవ్యక్తావ్య
క్తలలితసౌందర్యస్ఫుర
దలఘుతనుశ్రీసనాథ హరిహరనాథా!"

"దేవా దివ్యచిత్తంబున నవధరింపు" మని హరిహరనాథునిఁ బ్రసాదాభిముఖుని గావించుకొని విరాటపర్వము మొదలుగా స్వర్గారోహణపర్యంతముఁ బదునేనుపర్వముల నాంధ్రీకరించి యాంధ్రదేశీయుల నుద్ధరించి,

"చ. పరమపదాప్తిహేతు వగుభారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపునం గరఁగుచొప్పునఁ జెప్పినవారు మోదసం
భరితతఁ బొంది యక్కథకు బ్రాఁతిగ నర్పితుఁ జేసి రర్మిలిన్
హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁ జూడు మెప్పుడున్."

అనుపద్యమున హరిహరనాథునిసదయావలోకనముఁ బ్రార్థించి స్వర్గారోహణపర్వాంతమున నున్నమాలినీవృత్తములో "సంభృతానంద భావా" యనుసంబోధనమునఁ దాను మొదటఁ గోరిన 'బ్రహ్మానంద సంభృతిని' వచించెను.

తిక్కనసోమయాజికాలమున నెల్లూరున హరిహరాలయము గల దనియు నాతనిపేరిటనే తిక్కనసోమయాజి తనభారతము నంకితము గావించె ననియుఁ జెప్పెదరు కాని యది యథార్థము కాదు. తిక్కనసోమయాజికాలమున హరిహరనాథునియాలయము నెల్లూరున లే దని చెప్పవచ్చును. తిక్కనసోమయాజిచే భారతమున స్మరింపఁబడిన హరిహరనాథుఁడు హరిహరులకు భేదము పాటింపనియద్వైతుల కుపాస్యుఁడును, హరిహరుల కధినాథుఁడు నగుసర్వేశ్వరుఁ డని విరాటపర్వములోనియవతారికను గాని యాశ్వాసాద్యంతపద్యములను గాని విమర్శించిచూచినపక్షమున బోధపడఁగలదు.

నన్నయభట్టారకుఁడును దిక్కనసోమయాజియును నేకకాలమునం దున్నవా రని కథలు కొన్ని కవిజీవితములందును గవులచరిత్రమునందును నుదాహరింపఁబడుటయెగాక కవిజీవితములం దావాదమె సిద్ధాంతము చేయఁబడియున్నది. కాని నూతనపరిశోధనములవలన నాయిరువురును సమకాలికులు కా రనియు నిరువుర కిన్నూఱుసంవత్సరములు కాలభేదము గల దనియు స్పష్టపడినది. కావున నాకథలన్నియు నవిశ్వాసపాత్రము లై వ్యర్థము లైపోయినవి. నన్నయ

పదునొకండవశతాబ్దిమధ్యమునను, దిక్కన పదుమూఁడవశతాబ్దిమధ్యమున నుండిరి.

ఈమహాభారతమును రచించునపుడు తిక్కనసోమయాజి చేసిన నియమము మఱియొక్కటి గానవచ్చుచున్నది. ఏదియన,

"గీ. కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వప
ర్వార్థయుక్తిఁ జేయునట్టియెడల
యత్న మించుకంతయైనను వలవదు
వలసినట్లు చెప్పవచ్చియుండు."

అని చెప్పి సోమయాజి గ్రంథము ప్రారంభము చేసెను.

అనఁగా భారతకథ జగత్ప్రసిద్ధ మైనది; కావునఁ బూర్వపర్వార్థములను సందర్భింపఁజేయునప్పుడు యత్న మేమాత్ర మక్కఱయుండ దనియును, ఇష్టానుసారముగ సందర్భము పొసఁగింపవచ్చుననియుఁ జెప్పినపద్యమే కాని మఱియొండు గాదు. ఈపద్యమును బురస్కరించుకొనియెకాఁబోలు సోమయాజి భారతముఁ దెనిఁగించుచో మాతృక యైనమూలగ్రంథమును ముట్టకయె యాశుధారగ నిరంకుశప్రజ్ఞతోఁ జేసియున్నాఁ డనుప్రవాద మొకటి లోకములో వ్యాపించియున్నది. ఈతెలుఁగుభారతము కష్టపడి సావకాశముగా నాలోచించి చక్కఁగాఁ జేయఁబడినగ్రంథమె కాని జను లనుకొనునట్లు మూలగ్రంథమును ముట్టక తెరలోఁ గూరుచుండి నోరికివచ్చినట్లెల్లను జెప్పఁబడినది కాదని కవులచరిత్రమునం దీయఁబడినసమాధానము సమంజస మైనదిగా నున్నది. తిక్కనసోమయాజి యీభారతమును జెప్పునప్పుడు దీనిని వ్రాయుటకై నిర్ణయింపఁబడినవాఁడు కుమ్మరగురునాథుఁ డని చెప్పుదురు. ఈగురునాథునకుఁ జెప్పినదానిని మరల నడుగక వ్రాయఁగలశక్తి యున్నదఁట.

ఈభారతమును రచించునపుడు తిక్కనసోమయాజి తడవుకొనకుండఁ గవిత్వముఁ జెప్పెద ననియుఁ, దా నొక్కసారి చెప్పినదానిని మరలఁ జెప్ప ననియుఁ జెప్పినదానిని మరల మార్చుకొన ననియుఁ బ్రతిజ్ఞ చేసినట్లును, జెప్పినమాటను మరల నడుగక గురునాథుఁడు వ్రాయుచుండఁగా శల్యపర్వములోఁ బ్రథమాశ్వాసముకడపట సహదేవుఁడు శకునిని జంపినతరువాత దుర్యోధనుఁడు తొలఁగిపోయె నని ధృతరాష్ట్రునితో సంజయుఁడు చెప్పుభాగమున,

"క. పలపలని మూకలోఁ గా
లిలువక గుఱ్ఱంబు డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుఁ డగుచు నొక్కఁడుఁ
దొలఁగి చనియె—

అన్నంతవఱకుఁ బద్యమును జెప్పి తరువాత నేమియుఁ దోఁచక తిక్కన "యేమిచెప్పుదు గురునాథా" యని కుమ్మరగురునాథు నడిగినట్లును, అతఁ డది తన్నడిగినప్రశ్నగా భావింపక పద్యముతోఁ జేర్చి "తొలఁగి చనియె నేమిచెప్పుదు గురునాథా" యని వ్రాసినట్లు, నప్పుడు తిక్కనసోమయాజి తనప్రతిజ్ఞకు భంగము వచ్చె నని చింతించుచుండఁగా "నేమిచెప్పుదు గురునాథా" యని కవి లేఖకునిగూర్చి యుద్దేశించినది. 'కురునాథా' యని ధృతరాష్ట్రున కన్వయించి యాప్రశ్న యే పద్యపూరణమున కనుకూలించె నని గురునాథుఁ డాతని నూరార్చినట్లు నొకపిచ్చికథ కల దని యాంధ్రకవులచరిత్రమునందు గ్రంథస్థము గావింపఁబడి 'శ్రీమహాభారతము నాంధ్రీకరించిన యీమహాకవి కీచిఱుపద్యములోని యల్పభాగము తోఁచకపోయె నని సాధించుట కీకథ పనికిరాదు గాని తిక్కన యాశుధారగాఁ గవిత్వము చెప్పఁగలవాఁ డని స్థాపించుటకై యీకథ కల్పింపఁబడె ననిమాత్ర మూహింపఁ దగియున్న' దని యాంధ్రకవులచరిత్రమునందే సమాధానము చెప్పఁ

బడియున్నది. ఈపద్యముమూలముననే గురునాథుఁడు జన్మ మెత్తినాఁడు. ఈపద్యము మహాభారతమునఁ దిక్కనసోమయాజి వ్రాయకుండెనేని కుమ్మరగురునాథుఁడు జన్మ మెత్తకపోయుండును.

తిక్కనసోమయాజికిఁ గుమ్మరగురునాథుఁడు లేఖకుఁడుగా నుండె ననుట సత్యము కాదు. తిక్కన చేసినప్రతిజ్ఞమాటయు సత్యము కాదు. తిక్కన పూర్వాపరసందర్భములను జక్కఁగా నాలోచించి కవిత్వము చెప్పినవాఁడు గాని పైప్రతిజ్ఞతోఁ జెప్పినవాఁడు కాఁడని యీక్రిందివిషయమునుబట్టి స్పష్టపడఁగలదు.

ఒకసారి చెప్పినవిషయమును మరలఁ జెప్పవలసివచ్చినప్పుడును, బూర్వోక్తార్థమున కనువాదముఁ జేసినవర్ణనము మఱియొకప్రకరణమునఁ జేయవలసినప్పుడును దిక్కనసోమయాజి తొలుతఁ జెప్పిన గద్యపద్యములనే మరలఁ జెప్పుచువచ్చెను. మఱియు నొకప్రకరణమునఁ జేయవలసివచ్చినప్పుడు ప్రకరణానురూపముగఁ గొంచెము మార్పుఁ జేసి మున్నటిగద్యపద్యములనే వాడియున్నవాఁడు. ఇట్టి పద్ధతి భారతములో నవలంబించుటయేగాక తాను రచియించిన నిర్వచనోత్తరరామాయణములోని పద్యములనుసైతము నించుక మార్చియు మార్పకయు సందర్భము గలిగినపుడు భారతములోఁ జొప్పించియున్నాఁడు. ఇందులకుఁ గొన్నిదృష్టాంతములను జూపుచున్నాఁడను.

ద్రోణపర్వమునం దభిమన్యుఁడు చంపఁబడినతరువాత ధర్మరాజునకు దుఃఖోపశమనముగాఁ గృష్ణద్వైపాయనుఁడు బోధించిన షోడశరాజచరిత్రమును దెలుపునట్టిపద్యములనే శాంతిపర్వమున బంధుమరణార్తిచేఁ దపించుచున్నధర్మరాజునకు గదాగ్రజుఁ డాకథను జెప్పవలసినసందర్భమునఁ బొందుపఱిచియున్నాఁడు. విరాటపర్వముద్వితీయా

శ్వాసములోఁ గీచకుఁడు తనయెడ మోహావేశపరవశుఁ డైనపు డాతని నదల్చుటకై ద్రౌపదిచేఁ జెప్పించిన,

"శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ విజృంభించి గం
ధర్వుల్ ప్రాణము మానముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!"

అనుపద్యమునే ద్రౌపది తనభంగపాటును భీమునితో విన్నవించునపుడును దాను గీచకు నిట్లదల్చితి నని చెప్పుసందర్భమున నీపద్యమునే మరల చెప్పియున్నాఁడు.

ఉద్యోగపర్వములోఁ గౌరవులకడకు శ్రీకృష్ణుని రాయబారిగాఁ బంపినపుడు పాండవు లేవురును దమతమయభిప్రాయములను వేఱువేఱ కృష్ణునితోఁ జెప్పునప్పుడు భీముఁడు తనమాటఁగాఁ జెప్పినట్లుండు,

"తే. అన్నదమ్ముల మైయుండి యీకట మనకు
నొరులు తలయెత్తి చూడ నొండొరులలోడఁ
బెనఁగ నేటికి నేనేల పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ?"

అనుపద్యమునే స్త్రీపర్వములో గాంధారికిఁ గోపశాంతి కలిగించుటకై వినయముతో భీముఁడు ప్రయత్నించినపుడును జెప్పియున్నాఁడు.

విరాటపర్వములోఁ బ్రథమాశ్వాసమున విరాటరాజు తన కూఁతు రగునుత్తరను నాట్యశిక్షకై బృహన్నల కప్పగించుటకై రప్పించునప్పు డామెను వర్ణించిన,

"సీ. అల్లదనంబున ననువు మైకొనఁ జూచు
నడపుకాంతికి వింతతోడవు గాఁగ
వెడవెడ నూఁగారి వింతమై యేర్పడ
దారనిభగుల్లలో నారు నిగుడ

నిట్టలు ద్రోఁచుచు నెలవుల కలమేర
ల్లెను జిగిరెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కి
తారకంబులఁ గల్కితనము దొఁషరఁ

ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపు మండ నుత్తర సనుదెంచె
నలరుమరునిషవ్వు టమ్ము పోలె."

అనుపద్యమునే శాంతిపర్వప్రథమాశ్వాసములో సృంజయరాజుకూఁతును నారదుఁడు మోహించినకథను జెప్పుచు దానివర్ణన సేయుచు నాటవెలఁదిగీతి 3, ర పాదములను "ఉనికిఁ దెల్ప సృంజయునిపుత్రి మెలఁగువిధంబు నారదునకుఁ దగులొనర్చె" అని మార్చి ప్రయోగించియున్నాఁడు.

భీష్మపర్వము మొదట సంజయుఁడు ధృతరాష్ట్రునకు భీష్మశర తల్పగమనమును జెప్పునప్పుడు వ్రాసిన;

"సీ. ఆత్మయోధుల కెల్ల నాధార మగునట్టి
తనకు నస్త్రంబు లాధార మయ్యెఁ
బరశురామునకు మేల్పరిగొన తనయుఁడు
గలిగె భంగంబు శిఖండిచేత
జనపతి దను నచ్చి మును జూద మొనరించెఁ
దాను గయ్యంపుజూదమున నోడెఁ
దనయార్పు టెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ
నొలుచు నేలకు నొఱఁగె నేఁడు

ఆ. తీవ్రబాణజాలదీప్తులు పరఁగించి
పాండుతనయసైన్యబహుళతమము
లీలఁ బదిదినంబు లోలిమై విరియించి
యధిప భీష్మభానుఁ డస్తమించె."

అనుపద్యములోఁ గడపటి యాటవెలఁదిగీతినే స్త్రీపర్వద్వితీయాశ్వాసమున గాంధారి భీష్ముంగూర్చి శోకించుచుఁ గృష్ణునితోఁ జెప్పునప్పుడు మూఁడునాలుగుపాదములలో నుండు 'పదిదినంబు లోలిమై విరియించి యధిప' యనుపదములను 'పదిదినములు దోలి వినోదించి యనఘ' యనుపదములతో నూర్చి వ్రాసెను. ద్రోణపర్వముతృతీయాశ్వాసములో సైంధవవధార్థ మర్జునుఁ డరుగుచు ధర్మరాజును బట్టి మఱొకనికిచ్చునట్టులు ద్రోణుఁడు చేసినప్రతిజ్ఞ మనస్సునకుఁ దట్టఁగా సాత్యకిం బిలిచి యాతనిరక్షణార్థము నియోగించునప్పుడు చెప్పిన,

"క. మనకు నిమిత్తము లెంతయు
నను కూలము లయ్యె గెలుతు మాహవమున నేఁ
జనియెదఁ బ్రతిజ్ఞఁ దీర్పఁగ
ననఘా ధర్మసుతురక్ష కరుగుము నీవున్."

"క. విను సింధురాజవధయును
మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా
వున నే నొకపని నీ వొక
పని మేకొని చేయు టరయఁ బాడియ కాదే."

"ఆ. ఏను నిలిచినట్ల కా నూఱడిల్లు నీ
వున్న నన్న రేశ్వరోత్తముండు
నిర్భరుండ వగుము నీవు నాదెస నాకు
హరి గలండు గలఁడె యచట నితఁడు."

"వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవలయును. పరాక్రమ ధుర్యుం డగునాచార్యునిప్రతిన యెఱుంగవే యనుటయు."

అనుపద్యగద్యములనే ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మనినప్పు డతఁ డతనితో నీసమాచారముఁ జెప్పుసందర్భమునఁ బ్రయోగించియున్నాఁడు. అప్పటిమాటలే యనువాదమునఁ జెప్పుట యెంతయుఁ జతురమై యుండెను.

కర్ణపర్వముప్రథమాశ్వాసమునఁ గర్ణునిదినయుద్ధమున శల్యుని పోరు వర్ణించుసందర్భమునఁ బ్రయోగించిన,

"సీ. కమలాకరములీలఁ గలఁచియాడెడు గంధ
దంతావళముసముద్దండతయును
దర విఁడి మృగసముత్కరము ఘోరంబుగా
వధయించుకంఠీరవంబు సేఁపు
సేరసారణ్యంబు నిర్భరాటోపతఁ
గాల్చుదావాగ్నియుగ్రక్రమంబుఁ
బ్రకటవిక్రాంతిఁ బరత్రయంబును సహిం
యించుఘోలాత్ముని రుద్రాటోపమును
ఆ. బోల్పఁబడియె నపుడు భుజగర్వశౌర్యప్ర
తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గోలు మసఁగి శాత్రవసైన్య
హననకేళి సల్పునవసరమున."

అనుపద్యమునే యాటవెలఁదిగీతి మొదటిపాదమునఁ "బోల్పఁబడియె నపు" డనుపదములను "బోల్పఁబట్టుగాఁగ" ననుపదములతో మార్చి శల్యపర్వప్రథమాశ్వాసమున శల్యునియుద్ధమును వర్ణించుచోఁ జెప్పి యున్నాఁడు.

ఇఁక నిర్వచనోత్తరరామాయణములోనిపద్యములను గొన్నిటి మార్చియు, మార్పకయు భారతమునఁ బ్రయోగించినవానిలో నొకటి రెండు దృష్టాంతములను జూపి విరమించుచున్నాను.

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప శాఙ్ర్గని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్."

ఈపద్యమును నిర్వచనోత్తరరామాయణములో మూఁడవయాశ్వాసమున మొదట వ్రాసియున్నాఁడు. దీనినే విరాటపర్వములో నైదవ

యాశ్వాసమునఁ గొంచెముమార్పు చేసి యీ క్రిందిరీతిగాఁ బ్రయోగించియున్నాఁడు.

"చ. గుణమున ల స్తకంబునను గోటియుగంబునఁ గేలఁ జాలభీ
షణముగ నుప్పతిల్లి రభసంబున నేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం జలింప నుగ్రతన్."

ఇంత 'తార' యనునది 'చాల' గను 'శార్ఙ్గనిక్వణన' మనునది 'గాండివక్వణనము' గను మార్పఁబడినవి.

మఱియుఁ దిక్కనసోమయాజి,

"మ. కలఁగెం దోయధిస స్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకావలయు సంక్షోభించె నావేధయున్."

అను నిర్వచనోత్తరరామాయణములో నైదవయాశ్వాసములోనిపద్యమును మార్పు చేయక యె విరాటపర్వములో నాలవయాశ్వాసమునఁ బ్రయోగించియున్నాఁడు.

నిర్వచనోత్తరరామాయణములో నాలవయాశ్వాసమున దేవదానవయుద్ధసందర్భమున రచియింపఁబడిన,

"మ. పటువేగంబున శాతభల్లచయసంపాతంబునన్ మింట మి
క్కుటమై పర్వ ధగద్ధగీయ మగుచుం గోసంబు రూపంబులై
చటులక్రీడఁ జరించున ట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి ర
క్కటదర్పోద్ధతులై పరస్పరజయాకాంక్షాప్రచండంబుగన్."

అనుపద్యమునే రెండవపాదమున "పర్వ ధగద్ధగీయ మగుచున్" అను పదములు "మంట ధగద్ధగద్ధగ యనన్" అనుపదములతో మార్చియు, నాలవపాదంబునందలి 'పరస్పరజయాకాంక్షాప్రచండంబుగన్' అను సమాసమును 'బరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్' అని వ్యస్త

పదములుగఁ జేసియు, విరాటపర్వము మూఁడవయాశ్వాసమున దక్షిణగోగ్రహణయుద్ధమునం బ్రయోగించియున్నాఁడు.

"శా. శ్రావ్యం బై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దారువీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మ్రోంచుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబు గా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్."

అను నిర్వచనోత్తరరామాయణములోఁ జతుర్థాశ్వాసమున రావణకుబేరులకు జరిగినయుద్ధసందర్భమునఁ బ్రయోగింపఁబడినదానిని మార్పేమియుఁ జేయకయే విరాటపర్వపంచమాశ్వాసమున నుత్తరగోగ్రహణమున ద్రోణార్జునసమరవర్ణనమునం జొప్పించియున్నాఁడు. ఇట్టివానిని బెక్కులు చూపవచ్చును. గ్రంథవిస్తరభీతిచే వానిని విరమించుచున్నాను.

---

# రెండవ ప్రకరణము

## భారతాంధ్రీకరణమునఁ దిక్కనసదృక్పథ మేమి?

తిక్కనసోమయాజి నన్నయభట్టారకునివలె సంస్కృతమహాభారతమును యథామూలముగా నాంధ్రీకరింపలే దనియు, మాతృకకు సరిగా రచింపకపోవుటయేగాక మూలములోని పెక్కుభాగములను దెలిఁగింపక విడిచిపెట్టియు, సంగ్రహపఱిచియు, నిచ్ఛానుసారము పెంచియు రచించినాఁ డనియు, నిప్పటిపండితులు కొందఱు దోషారోపణములను జేయుచుండుటను వినుచున్నారము. ఆంధ్రభారతకవిత్రయమువారి భాషాంతరీకరణపద్ధతియే వీరికి బోధపడినట్లు గనుపట్టదు. ఆంధ్రభారతము, సంస్కృతమహాభారతములోని ప్రధానకథనుమా

త్రము గైకొని, స్వతంత్రకావ్యముగా వ్రాయఁబడిన గ్రంథమె. కాని కేవలము సంస్కృతభారతమునకు మక్కికిమక్కిగాఁ దెలిఁగింపఁబడిన దని యనుకొనుటయుఁ బొరపాటు. ఇప్పటిసంస్కృతభారతము నన్నయ తిక్కనాదులకాలములో నిట్లే యున్న దనుకొనుటయు మఱియొకపొర పాటు. తిక్కనకృతభారతమును సంస్కృతమహాభారతమునకు భాషాం తరీకరణ మని తలంచుట తిక్కనయెడ మనము సేయునపరాధముగాఁ బరిగణింపవలయు నని యొకరు వ్రాసిరి. సంస్కృతమహాభారతము నుండి కథనుమాత్రము గైకొని మూలములో లేనియర్థాలంకారము లను, రసభావములను, మానవస్వభావవర్ణనలను స్వేచ్ఛగాఁ బెంచి యు, మూలములో విసుగుపుట్టించెడు ననేకదీర్ఘకథానకములను, వర్ణనలను, వేదాంతఘట్టములను సంగ్రహపఱిచియు, నిరంకుశవృత్తిఁ గైకొని మూలముకంటెను వేయింత లధికమనోహరముగా నుండు నటుల రచించిన స్వతంత్రమహాకావ్యమని యే చెప్పఁదగియున్నది కాని మఱి యన్యముగా నూహింపఁదగినది కాదని వ్రాసిరి. తిక్కనసోమ యాజి సంస్కృతభారతములో నున్నదానిని మక్కికిమక్కిగాఁ దెనిఁ గించిపెట్టియుండినయెడల నీయాంధ్రభారత మింతయుత్తమోత్తమ కావ్యముగా నుండకయెపోవును. సంస్కృతకావ్యేతిహాసములను భాషాంతరీకరింపవలసినరీతి నిప్పటిపండితులకంటె నెక్కువబాగుగా నెఱింగినవాఁడె కాని తిక్కనసోమయాజి యల్పజ్ఞుఁడు గాఁడు. ఈ సందర్భమున నే వ్రాయుచు విజ్ఞానసర్వస్వసంపాదకు లగు శ్రీయుత కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారు "సంస్కృతభారతము బంగారపుముద్దవంటిది. ఆంధ్రభారత మాముద్దలోనుండి కావలయు నంతబంగారమును దీసికొని స్వర్ణకారునిబుద్ధివైభవముతోఁ జేయఁ బడిన చక్కని సువర్ణకమలమువంటిది. ఉభయభారతములలోని యీభేదముఁ జూపి స్వర్ణకారునిబుద్ధివైభవము వెల్లడిచేయుటయే

మాయుద్దేశము'' అని యొకచోట వ్రాసియున్నారు. ఇదియెంతయు సయుక్తికమును సమంజసము నైనవాదము. ఈకాలమునందు, ముఖ్యముగా నీశతాబ్ది ప్రారంభమునుండి, సంస్కృతమహాభారతగ్రంథకర్తలను గూర్చియు, వారిరచనలను గూర్చియు, మీమాంసలు చర్చలు విశేషముగా జరుగుచున్నవి. అసంఖ్యాకము లయిన యీచర్చలలోని విషయములను బరిశీలించినప్పుడు, నేగ్రంథము సరియైనపాఠములతో నొప్పుచున్నదో యిప్పటిపండితులకుఁ బరిశోధకులకు నిర్ణయించుటకు సాధ్యము కాకయున్నప్పుడు, నెప్పుడో 7, 8 వందల సంవత్సరములకుఁ బూర్వమున నన్నయతిక్కనాదులకాలమున నీమూలగ్రంథ మెన్ని పాఠాంతరభేదములతో వ్యాప్తిఁ జెందియుండెనో యెవ్వరు నిరూపింపఁ గలరు ? ఈకారణమువలననే యాంధ్రభారతకవిత్రయములో నొక్కఁడగునెఱ్ఱనార్యుఁడు తననృసింహపురాణమునందుఁ బూర్వకవిస్తుతిఁ జేయుసందర్భమున,

> "భాసురభారతార్థములభంగులనిక్కమెఱుంగ నేరమిన్
> గాసటఁబొంద కే చదివి గాథలఁ ద్రవ్వి తెనుంగ వారికిన్
> వ్యాసమునిప్రణీతపరమార్గము తెల్లఁగఁ జేసినట్టి య
> బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్."

అని నన్నయతిక్కనార్యులనుమాత్రము స్మరించుటయగాక సంస్కృత మహాభారతమునుగూర్చి యొకవిశేషాంశమునుగూడఁ దెలుపుచున్నాఁడు. ఎఱ్ఱనార్యునికాల మిప్పటికిఁ గొంచెమించుమించుగా నాఱు శతాబ్దులక్రిందటి దని మన మెఱుంగుదుము. నన్నయభట్టారకునకు మూఁడుశతాబ్దులకుఁ బిమ్మటను, దిక్కనసోమయాజికి నూఱుసంవత్సరముల కనంతరకాలమున నెఱ్ఱనార్యుఁ డుండుటచేత నాతనియభిప్రాయములనుగూడ నొకింత మనము పరిగణనములోనికిం దేవలసియుండును. అతఁ డేమనుచున్నాఁడు ? వ్యాసమునిప్రణీతభాసురభారతార్థముల

రీతులసత్యత్వమును దెలిసికొనఁజాలక తెనుంగువా రాయాదేశములలో గందరగోళముగా బీభత్సరసములతో నొప్పుగాథలనే త్రవ్వుకొనుచు వ్యవహరించుకొనుచుండఁగా వారికి వ్యాసమునిప్రణీతభారతములోని పరమార్థమును స్పష్టపఱిచినట్టి యజ్ఞాసనకల్పులు నాద్యులు నగు నన్నయతిక్కనార్యులను స్మరించుచున్నా నని తెల్పుచున్నాఁడు. సంస్కృతమహాభారతమున నాగ్రంథమునకు మూఁడునామము లున్న ట్లాగ్రంథమునందే కన్పట్టుచుండెను. మొదటినామము 'జయ' మనియు, రెండవనామము 'భారత' మనియు, మూఁడవనామము 'మహాభారత' మనియు వ్యవహరింపఁబడుచున్నవి. భారతయుద్ధానంతరము వ్యాసుఁడు పాండవవిజయమును సూచింపుచు "జయ" మనుపేరిట వ్రాసిన యితిహాసకావ్యమే మూలగ్రంథముగా నెంచుట యుక్తిసంగతముగాఁ గానంబడుచున్నది. ఇందు ౮ వేల ౮ వందల శ్లోకములుమాత్రమె కల వనియు, నివియే వ్యాసమునిప్రణీతము లైయుండు ననియుఁ గొందఱువిమర్శకులు తలంచుచున్నారు.

> "శ్లో. అష్టౌశ్లోక సహస్రాణి
> అష్టౌశ్లోక శతానిచ
> అహంవేద్మి శుకోవేత్తి
> సంజయోవేత్తి వాసవ॥"

కొంద ఱీసంఖ్య నొప్పుకొనకున్నను, వీనిని ౨౪౦౦౦ శ్లోకములవఱకుఁ బెంచి వైశంపాయనుఁడు "భారత" మని పేరిడినదానినెల్ల వా రంగీకరించుచున్నారు. అటుపిమ్మటఁ గొంతకాలమునకు "సౌతి" యను నాతఁడు లక్షగ్రంథముగఁ జేసి "మహాభారత" మని పేరుంచినట్లు కన్పడుచున్నది. ఇప్పు డీమహాభారతమే వేర్వేఱురాష్ట్రములయందు వేర్వేఱుపాఠాంతరభేదములతో నొప్పియున్నది. మూలగ్రంథము యొక్కస్థితి యిట్లుండఁగా నన్నయతిక్కనార్యులకాలమున నెట్లుం

జెనో యూహింప సాధ్య మగునా ? కనుకనే నన్నయతిక్కనార్యులు వ్యాసమునిప్రణీతపరమార్థమును స్పష్టపఱిచినవా రని యెఱ్ఱనార్యుఁడు మనకుఁ దెలుపుచున్నాఁడు. కావున నన్నయతిక్కనాదులు మూలగ్రంథమును ముట్టలే దనికాని, మక్కికిమక్కిగాఁ దెనిఁగింపలే దనికాని యధిక్షేపించుటకు నెవ్వరికిని హక్కు లేదు. ఇట్లగుటచేతనే యీకాలమునందు సంస్కృతమహాభారతము పాఠాంతరభేదములతో సంపూర్తిగా ముద్రించుటకై పూనానగరమునందలి "భాండార్కరుఇన్స్టిట్యూటు" అనుపేరిటిసమితివారు వివిధరాష్ట్రములనుండి ప్రచారమునందున్నప్రతులనుమాత్రమె కాక యముద్రితములై పడియున్న భిన్నభిన్నములై వివిధపాఠాంతరములతోఁ గూడుకొనియున్నప్రతులను బెక్కింటిని సంపాదించి పాఠాంతరభేదములతో ముద్రించుటకై సంకల్పించి యిప్పటికి విరాటపర్వమునుమాత్రము ముద్రింపఁగలిగిరి. ఇట్లుండినసందర్భములో మూలమును మక్కికిమక్కిగాఁ దెలిఁగింపఁబూనినకవి యేపాఠమును సరియైన దని విశ్వసింప సాధ్యమగును ? ఇట్లుండినపుడు కవియగువాఁ డేమార్గము తనకు సరియైన దని విశ్వసించునో యట్టిస్వతంత్రమార్గమునే యనుసరించి పోవుట సంభవించును గాని యన్నిమార్గముల ననుసరించి పోవుట యసంభవముగా నుండును గదా ! ఎప్పటివారిమాటయో మన కేల ? ఇప్పటివిమర్శకాగ్రేసరుల దృక్పథము లన్నియు నొక్కరీతిగా నున్న వని యెవ్వరైనఁ జెప్పఁగలరా ? సంస్కృతమహాభారత మంతయు వ్యాసమునిప్రణీతము కాదని యామహాగ్రంథమే తెలుపుచుండుటచేత, నిప్పటివిమర్శకాగ్రేసరులగు పెక్కండ్రదృక్పథములలో నట్లే నిర్ధారింపఁబడియుండుటచేతఁ నాదిపర్వమునందును నంత్యపర్వమునందును "జయోనామేతిహాసోయమ్" అనఁగా మూలగ్రంథ మితిహాస మైయున్న దని చెప్పఁబడియుండుటచేత, నయ్యాది మహాభారతమునం దంతర్గర్భిత మైయుండుట

చేతను, బ్రపంచములో వేఱ్ఱేఱుదృక్పథములు వ్యాపించుటకు నవకా శము గలుగుచున్నది. ఇట్లుండునప్పు డొకరిదృక్పథము ఘనమైన దనియు, మఱియొకరిదృక్పథము హీనమైన దనియు వాదులాడుట వివేక మనిపించుకొనదు. ఈనాఁటివిమర్శకాగ్రేసరులలో నొక రగు నామిత్రులు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు "ధర్మ ప్రధాన మగుభారతామ్నాయమును రసప్రధాన మగుభారతప్రబంధ ముగా మార్చి తిక్కనసోమయాజి మహాభారతమును జాలహీనస్థితిలో నికిఁ దెచ్చుట సత్య మగు" నని యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయొక్క రజతోత్సవసంపుటమునఁ బ్రకటింపఁబడిన "తిక్కనార్యకృతవిరాట పర్వవిమర్శనము" నందు వ్రాయుట వారివిమర్శనములోని సంకుచిత భావమునే వెల్లడించుచుండె ననుట స్పష్ట మగుచున్నది. మఱియు వీరు ధర్మప్రధాన మగుభారతామ్నాయమును రసప్రధాన మగుకావ్య ముగా మార్చుట, "అతిపవిత్ర మగుదేవాలయమును వినోదదాయక మగుగృహస్థాలయముగా మార్చుటవంటిదే యగు" నని చెప్పుట యతిసాహసమును సత్యవిరుద్ధము నగుమాట కాని మఱియొండు కాదని స్పష్టముగా జెప్పవచ్చును. తిక్కనార్యుఁడుగూడ నీక్రిందిపద్యములో భారతమును బంచమవేద మనియు ధర్మమూల మనియు లిఖించి యున్నాఁడని,

"శా. విద్వత్సం స్తవనీయభవ్యకవితా వేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డగ్గిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైనయామ్నాయమున్.

క. వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా
మాదల ధర్మార్థకామమోక్షస్థితికిన్."

అనుపద్యముల నుదాహరించి, "యిట్టిదానిని గావ్యకళాదృష్టితో విరచించుట యన, దానిఘనతను దీసివేయుట గాదె?" యని యడుగుచున్నారు.

పైపద్యములలోఁ దిక్కనసోమయాజి భారతసంహిత ధర్మార్థకామమోక్షములకు మూల మని చెప్పియున్నాఁడే కాని యీయపూర్వవిమర్శకాగ్రేసరులు తలంచినట్లుగాఁ గేవలము ధర్మమూల మని చెప్పియుండలేదు. తిక్కనార్యుఁడు "భారతాఖ్య మగు లేఖ్యం బైన యామ్నాయ" మనిమాత్రమె పల్కుచున్నాఁడు గాని "మహాభారతాఖ్య మగు లేఖ్యం బైనయామ్నాయ" మనుచుండలేదు. ఈపద్యములు విరాటపర్వమునకు మొదట తిక్కన రచించియున్నాఁడు. పదునేనుపర్వములు రచించినతరువాతఁ దుదిభాగమున ఫలశ్రుతిలో:-

"ఉ. భ్రాజితవృత్తిమైఁ బరఁగుభారతసంహిత, సంయమీంద్రులా
రా, జయనామకంబునను రాజితసంగి జగత్రయంబునం
బూజితకీర్తి యై నెగడు; భూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే
రాజు, లిలాసురుల్, మఱి యరాతుల గెల్తురు విన్నయంతటన్."

అనుపద్యమునుగూడ లిఖించియున్నాఁడు. దీనిలో వ్యాసమునిప్రణీత మగు జయనామకకావ్యమునే, యీయితిహాసమునే, భారతసంహితనుగా భావించుచున్నట్టు దెల్పుచున్నాఁడు. వ్యాసప్రణీత మగు జయనామకకావ్య మనం బరఁగినభారతసంహిత కేవలము ధర్మమోక్షములకుమాత్రమె కాక యర్థకామములకుఁగూడ నుపకరించునట్టి దని పైపద్యమునుబట్టి బోధపడుచుండలేదా? ఈప్రఖ్యాతమైన విజయనామకభారతేతిహాసమును విన్నమాత్రముచేతనే రాజులును భూసురులును గొప్పదైన విజయముయొక్క యున్నతిని బొందుదు రనియు, మఱియు శత్రువులనుగూడ గెల్తు రనియుఁ జెప్పుచున్నాఁడు. అర్థకామములయందుఁ గోరికయే లేకుండినయెడల గొప్పవిజయముయొక్క

యున్నతిని బొందుటయు, శత్రువులను జయించుటయు నెందుకొఱకు? మఱియుఁ దిక్కనసోమయాజి వ్యాసుని వర్ణించునపుడు మొదటిపద్యములో విజ్ఞానసంపద్విఖ్యాతుఁ డనియుమాత్రమె కాక "విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుం" డనికూడ వర్ణించియున్నాఁడే? ఇట్టివానికిఁ గావ్యకళాదృష్టి లేదని బ్రహ్మయ్యశాస్త్రిగారు చెప్పఁగలరా? కొందఱు తలంచునట్లు వ్యాసుఁడు శుద్ధఛాందసుఁడు గాఁడు.

"భారతదృక్పథములం గూర్చి నన్నపార్యుఁడు వ్యాసాశయముల ననుసరించి యిట్లు వ్రాసినాఁ" డని యుదాహరించిన

"సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్షణసం బనియును
నైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ."

అనుపద్యములోఁ "గవివృషభులు మహాకావ్య" మని కొనియాడుచుందు రనియుఁ జెప్పియున్నాఁడు గదా? రసప్రధాన మైనదానిఁగా వ్యాసుఁడు భారతమును రచించుటచేతనేకదా యయ్యాది కవిశ్రేష్ఠులచేత మహాకావ్యముగాఁ గొనియాడఁబడుచుండుట సంభవించుచున్నది! రసప్రధాన మైనది కాకుండినయెడల మహాకావ్య మనిపించుకొనుట యెట్లు? ధర్మప్రధాన మగుభారతామ్నాయమును రసప్రధాన మగు భారతప్రబంధముగాఁ జేయుట మహాభారతమును జాల హీనస్థితిలోనికిఁ దెచ్చుటయే యగునేని వ్యాసుఁడే నిందార్హుఁ డగును గాని తిక్కనసోమయాజి కాఁ డని విమర్శకాగ్రేసరులు తెలిసికోవలసి యుండును. కాని యిందు వ్యాసునితప్పు గాని తిక్కనసోమయాజితప్పు

గాని కానరా దని నాయభిప్రాయము. ఈదోషమంతయు విమర్శకాగ్రేసరులదృక్పథములోనే యున్నది.

నన్నయభట్టారకుఁడు తనపద్యములో నుదాహరించిన దృక్పథములన్నిటిని దనమనంబునం దిమిడ్చికొనియే, తిక్కనసోమయాజి భారతమును దెలిఁగించినాఁడు. కాని బ్రహ్మయ్యశాస్త్రులవారు తలంచినట్లు కేవలము కావ్యకళాదృష్టినే ప్రధానము చేసికొని ధర్మాదుల నంతగాఁ బాటింపక గ్రంథము వ్రాసినాఁడని యధిక్షేపించుట యెంతమాత్రమును దగియుండ నేరదు. "తిక్కనార్యుఁడు తాను గావ్యకళాదృష్టితో వ్రాసితి నని యెచ్చటను దెల్పలేదు, కాని" యని తాము వ్రాయుచు "నాతనిభాషాంతరీకరణగమనికం గనఁ దనకావ్యకళాచాతురిని జూపుటకై తీసికొనినశ్రమను ధర్మాదివివరణములకై తీసికొనలే దని బోధలోనికి వచ్చు" ననిరి. తిక్కనసోమయాజి విరచించిన శాంత్యానుశాసనికపర్వములను విమర్శనాదృష్టి కలిగి నిష్పక్షపాతబుద్ధితోఁ బఠించినవా రెవ్వరును బ్రహ్మయ్యశాస్త్రిగారియభిప్రాయముతో నెంతమాత్రము నేకీభవింపఁజాలరు. "పంచమవేదమునకుఁ బ్రాణభూత మైనభగవద్గీతనే యాతఁడు ముట్టలే" దని వ్రాయుట సత్యదూర మగువిషయము. కీర్తిశేషులైన శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు తాము వ్రాసిన విమర్శనపీఠికలోనిదాని నీదిగువ నుదాహరించుచున్నాఁడను.

"భగవద్గీతల నతఁడు తెనుఁగు సేయక యుపేక్షించె నని జనప్రతీతి కలదు గాని యది యట్లుకాదు. దానింగూడ సంగ్రహముగఁ దెనుఁగుఁ జేసియున్నాఁడు."

"శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే, సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ, కిమ కుర్వత సంజయ."

అను భగవద్గీతాప్రథమశ్లోకమును,

"కం. మానుగ ధర్మక్షేత్రం
బైనకురుక్షేత్రమున మహాహవమునకుం
బూని మనబలముఁ బాండవ
సేనయు నిట్లు వన్ని యేమి సేసెం జెపుమా."

అనుకందపద్యమునఁ దెనిఁగించి,

"తే. ఇంతపాపంబు సేయంగ నెత్తికొందు
రయ్య రాజ్యభోగంబున నఖిలబంధు
జనుల వధియింపఁ దొడఁగితి నని రథంబు
మీఁదఁ గూర్చుండఁబడియెఁ జే యూదికొనుచు."

అనుపద్యముపర్యంతము ప్రథమాధ్యాయమంతయుఁ దెనిఁగించెను. "ఇవ్విధంబున శోకసంవిగ్నమానసుండును, విషాదవిహ్వలుండును, బరమకరుణాభరితుండును నై శరశరాసనంబులు విడిచి కన్నీరు దొరంగ నూరకున్నసవ్యసాచిం జూచి మధుసూదనుం డి ట్లనియె." అనువచనము మొదలుగా ద్వితీయాధ్యాయముఁ దెనిఁగింపఁ బూని సంగ్రహముగా విభూతియోగాంతము లైనతొమ్మిదియధ్యాయములసారాభిప్రాయము సంక్షేపముగాఁ దెలిపి విశ్వరూపసందర్శనయోగాధ్యాయమం దలికథను,

"మ. అతిగుహ్యం బిది నీవు భూరికృప నీయధ్యాత్మముం గానఁ జే
సితి నా కిమ్మెయి విన్కిఁ గొంతభ్రమ వాసెన్ యోగివ్రాతధ్యేయమై
యతులైశ్వర్యవిభూతి నొప్పు భవదీయం బైనరూపంబు సూ
చుతలం పెత్తెడుఁ బోలు నేని దయఁ జక్షుఃప్రీతిఁ గావింపవే."

అనుపద్యముమున్నుగాఁ గొన్నింటఁ దేటపఱిచి పిమ్మటియధ్యాయముల యభిప్రాయముల సంగ్రహించుచు మోక్షసన్న్యాసయోగప్రతిపాదక మగుకడపటియధ్యాయమందుఁ బ్రధాన మైన:—

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అనుశ్లోకమును,

"తే. క్రందుకొను సర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నేనొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకుc బొలcగింతు నిన్నుc బ్రమోద మంద."

అనుపద్యమునc దెనిcగించి,

"శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ."

అను భగవద్గీతాంత్యశ్లోకమును,

"తే. అధిప యోగేశ్వరేశ్వరుం డైనకృష్ణుc
డును ధనుర్ధరవర్యుc డర్జునుcడు నెచట
నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు
భూతి నిత్యంబు లగు నిది నాతలంపు."

అనుపద్యమున నాంధ్రీకరించెను.

ఈ పైనుదాహరించినరీతిగాc దిక్కనసోమయాజి పద్యము వచనములc గలిపి యేcబదింటిలో భగవద్గీతాసారమును సంక్షేపాకృతితోc దెలిపియుండcగా, భగవద్గీతలను ముట్టనేలే దని బ్రహ్మయ్యశాస్త్రులుగారు పొరపడి వ్రాయుట విమర్శకలక్షణము గాదని వేఱుగc దెలుపవలయునా ?

"తిక్కనార్యుc డద్వైతదృష్టితోcగూడ భారతాంధ్రీకరణ మొనరించె నని మనసవవిమర్శకులు వ్రాసిరి. కాని యది మూలము లేనివ్రాcత. తిక్కన వేదాంతపరిజ్ఞానము కలవాcడే కావచ్చును గాని యూతనిగ్రంథ మాయంశమును రూఢిచేయుట లేదు." అని యధిక్షేపించుచున్నారు.

తిక్కన తనభారతమును దనయిష్టదైవ మైనహరిహరనాథున కంకితము చేసెను. ఆశ్వాసాద్యంతములయందలి యాహరిహరనాథుని గూర్చినసంబోధనపద్యములం బఠించినవారికిc దిక్కన యెంతటివేదాంతపరిజ్ఞానముc గలిగియున్నాcడో విస్పష్టముగా బోధపడకమానదు,

కాని సంస్కృతభారత మొక్కయద్వైతదృష్టితోడనే రచియింపఁ బడిన దనుటయు న్యాయ్యము కాదు. సంస్కృతభారతము వివిధ తత్త్వార్థబోధక మైనదిగాఁ గన్పట్టుచున్నది కాని కేవల మొక్కయద్వైతదృష్టితోనే రచింపఁబడినట్లు గానరాదు. మూలగ్రంథ మెట్టిమతదృక్పథము ననుసరించి వ్రాయఁబడినదో తిక్కనభారతము గూడ నట్టిదృక్పథముతోనే వ్రాయఁబడిన దని విజ్ఞులయభిప్రాయ మైయున్నది. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతవివిధతత్త్వసూచకము లగు మతబోధనలును, కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము లను గూర్చినబోధనములును, సంస్కృతభారతమునందువలెనే తిక్కన విరచితభారతమునందును నాయాసందర్భములలో సముచితరీతిని సంధానింపఁబడియే యున్నవి. ఇయ్యవి తిక్కనవిరచితశాంతిపర్వము నామూలాగ్రముగా సరళహృదయముతోఁ బఠించినవారికి బోధపడక మానవు. కేవలము రంధ్రాన్వేషణబుద్ధితోఁ బఠించువారిదృక్కులకుఁ గానుపింపకపోవచ్చును. అందుకై మన మచ్చెఱువుపడవలసిన పని లేదు.

కావున బ్రహ్మయ్యశాస్త్రిగారు తిక్కనసోమయాజి కేవలము కావ్యకళాదృష్టినే ప్రధానము చేసికొని తనభారతమును విరచించినాఁ డని తలపోయనక్కఱలేదు. నన్నయభట్టారకుఁ డెన్నిదృక్పథములను వ్యాసాశయముల ననుసరించి సూచించియున్నాఁడో, యాదృక్పథ ముల నన్నిటిని విస్మరింపక మనస్సునం దుంచుకొనియే తిక్కన తన భారతమును రచించి కొన్నికొన్నిఘట్టములలో మూలముకంటెను మెఱుఁగులు వెట్టి మహాభారతముప్రాశస్త్యమునకు వృద్ధిని సమకూర్చి నాఁ డని విజ్ఞు లగువారియభిమతము కాని, మహాభారతమును హీన స్థితిలోనికిఁ దెచ్చినవాఁ డని చెప్పుట యెన్నఁటికిని వారియభిమత మై యుండ దనియె నాయభిప్రాయము.

# మూఁడవ ప్రకరణము

## తిక్కన కావ్యకళాదృష్టి

ధర్మప్రధాన మగుభారతామ్నాయమును రసప్రధాన మగు భారతప్రబంధముగా మార్చి తిక్కన మహాభారతమును హీనస్థితిలోనికిఁ దెచ్చె నని వ్రాసినవిమర్శకులే, "ఏమైన నేమి? విరాటపర్వము ముఖ్యముగాఁ గావ్యకళాదృష్టితోనే వ్రాయఁబడిన దని చెప్పినఁ జెప్ప వచ్చును. ఏమన, నందుఁ బురుషార్థచతుష్టయములో నర్థకామములకే హెచ్చగుతావు కలదు గాని ధర్మమోక్షముల కంతగాఁ దావు లేదు" అనువాక్యములను వ్రాయుటవలననే తిక్కనకవితారచనము నందు దోష మావంతయు లే దనియు, నేయేకథాసందర్భముల యందుఁ దనకావ్యకళాచాతుర్యమును గనుపఱుచుటకు నెక్కువగా నవకాశము గలదో యాసందర్భములలో నాయాతావులందుమాత్రమే తనకావ్యకళాచాతుర్యమును నెక్కువగాఁ జూపించినవాఁడు గాని యనవసరము లగుతావులయందుఁ జూపించియుండలే దనియుఁ, దిక్కనభారతమే వేయివిధములఁ జాటిచెప్పఁగల దని స్పష్ట మగుచున్నది. తిక్కనార్యుని కిది చాలఁ బ్రీతికరమైనపర్వ మనిరి. అగుఁగాక! దాన దోష మేమికలదు? కాని యీతనికి దీనియం దున్నమో హితర పర్వములందు లేదని చెప్పు టతిసాహస మనిపించుకొనును. అది యథార్థమును బోధించునదియుఁ గాదు. కనుకనే తాను దెనిఁగించు పదునేనుపర్వములనుగూర్చి మొదట ముచ్చటించునపుడు విరాటపర్వము మొదటి దగుటచేత నీక్రిందిపద్యమును జెప్పినవాఁడు. కాని యీయపూర్వవిమర్శకులు భావించినట్లుగా నీపర్వమును బ్రత్యేకముగా వర్ణించి యితరముల వర్ణింపక విడిచినాఁ డనుట సంభావ్యము గాదు. చూడుఁడు.

"మ. హృదయాహ్లాదిచతుర్థమూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట నుద్యోగాదులుం గూడఁగాఁ
బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టంగ రచించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్."

ఈ పైపద్యమును దిక్కనసోమయాజి యేసందర్భమును బుర స్కరించుకొని చెప్పియున్నాఁడో ముందుగా మనము గ్రహింపవలసి యుండును. తనభారతపీఠికభాగమునందు భారతకృతినిర్మాణప్రస్తా వనలోఁ జెప్పినపద్య మిది. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండును, విజ్ఞానసంపద్విఖ్యాతుఁడును, సంయమిప్రకరసంభావ్యానుభావుండు నగు కృష్ణద్వైపాయనుఁడు లోకహితనిష్ఠను బూని ధర్మార్థకామమోక్ష స్థితికి మూల మైనభారత మనువేదమును ధర్మాద్వైతస్థితి రచించినాఁ డని ముందుగ వక్కాణించి యటుపిమ్మట,

"ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెనుపొందియుండ నం
దాదిదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

అనుపద్యమును వ్రాసియున్నాఁడు. అనఁగా వ్యాసకృతమూలభార తము వివిధార్థస్ఫురణము గలిగి పదునెన్మిదిపర్వములతోఁ గూడు కొన్నదై యతిశయించి యాదరణీయ మైయుండఁగా నందు మొదటి మూఁడుపర్వముల నాంధ్రకవిత్వవిశారదుండును, విద్యాదయితుండును, మహితాత్ముఁడు నగునన్నయభట్టు దక్షతతో రచించినాఁ డని చెప్పుచు నటుపిమ్మట నే పైపద్యమును జెప్పియున్నాఁడు. మూఁడుపర్వములు నన్నయభట్టు రచింపఁగాఁ దక్కినపదునేనుపర్వములను దాను రచిం చితి నని తెలుపుటకొఱ కాపద్యమును జెప్పె నేకాని విరాటపర్వమును బ్రత్యేకముగా వర్ణించి తక్కినపర్వములను వర్ణింపక విడుచుటకొఱకుఁ గా దని యాసందర్భమే విస్పష్టపఱుచుచుండఁగా నీయపూర్వవిమర్శ

కుఁడు విపరీతభావమును బ్రదర్శించుటకుఁ గడంగుట పరిహాసాస్పద మైనవిషయముగా నున్నది.

తిక్కనకు విరాటపర్వము ప్రీతికర మగుటచేత దానినిమాత్రమే ప్రత్యేకముగా వర్ణించి తక్కినపర్వము లంతగాఁ బ్రీతికరములు కాక పోవుటచేత వానిని వర్ణింపక విడిచినాఁ డని తెలుపుట విమర్శకులసంకు చితస్వభావమునే వెల్లడించుచున్నది కాని సత్యమైనవిషయమును దేటపఱుపఁజాలదు. తిక్కన భారతములోని ప్రతిపర్వమును దనపీఠికలో వర్ణించుటకుఁ బూనుకొనియుండఁడే దని యాపీఠికలోనియుదంతమే విస్పష్టపఱుచుచున్నది.

"ఈవిరాటపర్వము కథాచమత్కారము గలదియు, రససమంచిత మగునదియు, హృదయాహ్లాదకర మగునదియు నని నుడివినాఁడు గనుకను, దీనిని శృంగారాదివర్ణనలతో విశేషముగాఁ బెంచినవాఁడు గనుకను నీతనికావ్యకళాచాతురిని దెలిసికొనుటకు నీపర్వవిమర్శనము బెట్టుకొనుట యుచితమే" యని తమకుఁదాము తలపోసికొనుచుఁ గుత్సితవిమర్శమునకు దొరకొని "మననవవిమర్శకులు కవికులసార్వభౌముఁ డగుతిక్కనార్యునికవితారహస్యమును బాగుగ గ్రహించుకొనఁజాలక తమయభినవకళాచాతురిచే నాతని నిలువఁబెట్టవలసి యున్నట్లు భావించి తమమెదడుఁ గ్రొత్తగాఁ బ్రవేశించి వికారములఁ బుట్టించుచున్న పాశ్చాత్యకవితావిశేషాభాసములనే సోమయాజియును బ్రధానముగాఁ జేసికొని కావ్యకళను బెంపుచేసె నని తేల్చుచు నందులకు వ్యర్థస్తవములఁ జేయ మొదలిడిరి. వీరియుపకారార్థము తిక్కయజ్వమార్గమున కెంతదూరముగా నున్నదో ముం దిందుఁ జూపవలసియున్నది." అని యొకవింతభావమును విమర్శకుముందుఁ దెలుప మొదలుపెట్టిరి. తిక్కన యుభయకవిమిత్రుఁ డనియు, బుధారాధనవిరాజి యనియుఁ జెప్పుకొనియున్నాఁడే కాని తా నెన్నఁడును నెచ్చో

టనుగూడఁ గవిసార్వభౌముఁడ నని చెప్పుకొనియుండలేదు. నే నెఱింగి నంతవఱకుఁ దిక్కనకాలము మొదలుకొని నేఁటికాలమువఱకును గల కవు లెవ్వరును నట్టిబిరుదముతోఁ బేర్కొనియుండలేదు. ఆంధ్రకవి ప్రపంచమునఁ బ్రాచీనమహాకవు లెల్లరును నత్యున్నతస్థాన మగు బ్రహ్మపదమున నాతని నధిష్ఠింపఁజేసి సప్తశతసంవత్సరములనుండి పూజించుచున్నారు. భారతకవిత్రయమువారిలోఁ గడపటివాఁడై ప్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదాభిధానము గల యెఱ్ఱాప్రెగ్గడ తన హరివంశములో,

"మ. తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదు నా నేర్చుఖం
బునఁ దాఁ బల్కినఁ బల్కు లాగమము లై పొల్పొందు నావాణి న
త్తను నీతం డొకరుండ నాఁ జను మహత్త్వాప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం గవితిక్కయజ్వ నిఖిలోర్వీదేవతాభ్యర్చితున్."

అనియుఁ గవిసార్వభౌముఁ డైనశ్రీనాథకవి తనభీమేశ్వరపురాణములో,

"ఉ. పంచమవేద మై పరఁగుభారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్."

అని పొగడినపొగడ్తలనే దృష్టాంతములుగాఁ జూపవచ్చును.

ఇమ్మహనీయుని నట్టిబ్రహ్మపదస్థానమునుండి భ్రష్టుని గావించి కూలఁద్రోయుటకు నెట్టిశక్తియుక్తులను బ్రయోగించినను నెట్టికలియుగబ్రహ్మలకై నను సాధ్యము కా దనువిషయము కవితావాసనం గలబాలురును బాలికలునుగూడ నెఱుంగునదే. అందునుగూర్చి నవ విమర్శకులు గాని ప్రాఁతవిమర్శకులు గాని ప్రస్తావింపఁ బనిలేదు.

మామిత్రులు బ్రహ్మయ్యశాస్త్రులుగారు "సంస్కృతగ్రంథము కంటెఁ గొన్నితావులఁ దిక్కనార్యునిగ్రంథము మెఱుఁగుగా నున్న

దనిన ననవచ్చు" నని వ్రాయుచున్నారు. సంస్కృతభారతముకంటెఁ దిక్కనభారత మేతావులందుఁ బ్రకాశవంతముగ నున్నదో యాతావులనుగూడఁ దమవిమర్శనమునఁ బాఠకులకుఁ జూపుటకై శ్రద్ధను బూని ప్రయత్నింపరు గాని రంధ్రాన్వేషణముఁ జేయుచు దోషములను జూపుటకై ఫుండువై పునకుఁ బర్విడునీఁగవలెనే పర్విడుచుందురు. ఇదియే వీరివిమర్శనలందుఁ గానుపించు గొప్పలోపము. అదియేమిచిత్రమో కాని యీయపూర్వవిమర్శకాగ్రేసరునకు నన్నయభట్టారకునియెడఁ గలగౌరవమాత్రమయినను దిక్కనసోమయాజియెడఁ గన్పట్టదు. మొదలనుండియు నొకవిధ మైనయసహనభావమే చూపుచుండును.

"తిక్కన యెక్కువవాఁడే. అయినను నక్కడక్కడఁ బ్రమాదములకు లోనగుచువచ్చినాఁడు. అది కనిపట్టక యిదివఱకు మననవ విమర్శకులు తిక్కనయందుఁ గలిగినగ్రుడ్డివ్యామోహముచే దోషములనుగూడ గుణములుగానే వర్ణించివేసిరి. అదియే కూడనిపని. అదియే సారస్వతమునకు హానిని గలిగించునది. కానఁ, దిక్కనార్యుని దోషములను దోషము లనియు, గుణములను గుణము లనియు సందర్భానుకూలముగా నిరూపించుచు నిష్పాక్షికవిమర్శనమును లోకహితార్థమై యిప్పుడు కావించుకొందము.

గుణవత్తర మనియు దోషరహిత మనియు నిదివఱకుఁ బ్రజలందఱచేతను గొనియాడఁబడుచున్నది తిక్కనభారతము. అట్టిలోకాతీత మైనప్రఖ్యాతి గల తిక్కసార్వభౌమునివిరాటపర్వమున దోషములఁగూడ నెంచుటయా యని యాగ్రహమును వహింపకుఁడు. అట్లు చేయుట తగదు. ప్రమాదములు ధీమంతులకయిన నుండవచ్చును గదా. లోకసామాన్యదృష్టికి మనోహరజలపూరితముగాఁ గాన్పించుచున్నతటాకోదకము పారిశుద్ధ్యవిచారకపరీక్షలోఁ బెట్టిచూచినఁ

గొంతదోషయుతముగాఁ గాన్పింపవచ్చును. అయినను లోకము మెచ్చుచున్న దనుకారణమునఁ బారిశుద్ధ్యవిమర్శకాభిప్రాయమును వ్రాసి వేయరాదు. అట్లువ్రాసివేయుట హానికి మూల మగును. అట్లే నిక్కమైనకావ్యకళాదృష్టితోఁ బరీక్షించిచూచిన దోషాదికము లేవైనఁ గాన్పించిన వానిఁ వ్రాసివేయుట సారస్వతమునకు హానికర మగును. కాఁబట్టి మననవవిమర్శకులు కావ్యకళాదృష్టితోఁ గావించిన విరాటపర్వవిమర్శన మెంతపటుత్వము గలదిగా నున్నదో కావ్యకళాదృష్టితోఁ బరిశీలించిచూచుకొందము. చదువరులు శాంతచిత్తములతోఁ జిత్తగింతురుగాక !’’

అని తిక్కనార్యకృతవిరాటపర్వవిమర్శనమును బ్రారంభించుటకుముందు విమర్శకులు వ్రాసిన చమత్కారముగలపీఠిక యిది. ఇందు వీరు ‘‘తిక్కనయందుఁ గలిగినగ్రుడ్డవ్యామోహముచే’’ నని యొకచోటను, ‘‘అట్టిలోకాతీతమైనప్రఖ్యాతిఁ గలతిక్కకవి’’ యని యొకచోటను బిరుసుఁదనమును జూపుచు రెండువిసురులు విసరియుండుటచేత లోకహితార్థమై చేయఁబోవు నిష్పాక్షికవిమర్శన మేరీతిగ నుండునో వానిజాడలనీడలను ముందుగానే పాఠకులదృష్టికి గోచరింపఁ జేసి, వారివిమర్శన మెంతపటుత్వముగలదో, వారివిజ్ఞప్తిలోని రచనాచమత్కారమువలననే గ్రహింప ననువగురీతిని సూచించినసూచనమును మన మెంతేని మెచ్చుకోఁ దగియున్నది. మఱియు నింకొకవిశేషమునుగూడఁ దోపింపఁజేయుచున్నది.

మన కింతవఱకుఁ బ్రబంధపరమేశ్వరుని కావ్యకళాదృష్టికంటెను, గవిసార్వభౌముని కావ్యకళాదృష్టికంటెను, గవిబ్రహ్మగారి కావ్యకళాదృష్టి మిన్నందినదని బోధపడినది. ఇప్పుడో యీయపూర్వవిమర్శకబ్రహ్మగారివిజ్ఞప్తివలనఁ గవిబ్రహ్మగారి కావ్యకళాదృష్టి నిక్కమైన

కావ్యకళాదృష్టి గాక కృత్రిమమైనదిగా హీనమైనదిగాఁ 'తిక్కనవిరచితవిరాటపర్వవిమర్శనము'వలననే తెలియఁగల దని బోధపడుచున్నది.

ఇంతియగాక, యిదివఱకే గుణవత్తర మనియు దోషరహిత మనియుఁ బ్రజలందఱుచేతను గొనియాడఁబడుచున్న తిక్కనభారతము పట్లను, లోకాతీత మైనప్రఖ్యాతిని బొందిన తిక్కనకవిపట్లను, లోకము నంతట వ్యాపించియుండిన గ్రుడ్డివ్యామోహమును, లోకహితము కొఱకు వీరు ప్రారంభించిన నిష్పాక్షికవిమర్శనమే తొలఁగించి తిక్కన కావ్యకళాదృష్టియొక్క సహజస్వరూపమును బ్రదర్శింపఁగల దనికూడ బోధపడుచున్నది. కావున నిట్టిమహాకార్యమునకు నేటికెదురీద నుంకించునట్లుగా సాహసించుచున్నారము గాన నెవ్వరును నాగ్రహింపవలసినపని లేదని, చదువరులు శాంతచిత్తములతోఁ జిత్తగింపవలె నని విమర్శకుల ప్రార్థన మైయున్నది. ఇట్టివిమర్శకు లెందఱు దేశమున బయల్వెడలి యెట్టెట్టివిమర్శనలను గావించి తిక్కనకావ్యకళ నగ్నిపరీక్షకెంత గుఱిగావించినను, బుటము పెట్టిన మేల్మిబంగారువలెనే ప్రకాశింపఁగల దని యందఱకును దృఢవిశ్వాసము నిండుకొనియున్నది.

పాండవులు తమ దుర్ఘటమైన యజ్ఞాతవాసదీక్షను నడపినవిధానము భారతములోని పదునెన్మిదిపర్వములలో, నేపర్వమున వర్ణింపఁబడియెనో, యాపర్వమునకే విరాటపర్వ మను పేరు పెట్టఁబడినది. తమయజ్ఞాతవాసదీక్షను గడపుట కనువయిన దేశము మత్స్యదేశము నుగా నిర్ణయించుకొని యాదేశమునకుఁ బ్రభు వయిన విరాటరాజు కొల్వుకూటమునఁ బ్రచ్ఛన్నవేషములతో నాతని సేవింపుచు, నాతని రాజధానీనగర మగు నుపప్లావ్య మనువిరాటనగరంబున నొకసంవత్సర కాలము, పాండవులు గడపుట సంభవించినది కావున నద్దానినంతయు

వర్ణించుపర్వమునకు విరాటపర్వ మని నామకరణముఁ జేయుట సమంజసముగానే కన్పట్టుచున్నది.

## పాండవుల విరాటసభాప్రవేశము.

"తిక్కనార్యుఁడు పాండవుల విరాటనగరప్రవేశము నెట్లు సమర్థించుకొనివచ్చెనో దానిని ముందుగా మనము కనుఁగొనవలసి యున్నది. ఈసందర్భములో సోమయాజి పాండవులయజ్ఞాతవాసమును సురక్షితము చేయలేకపోయె నని చెప్పితీరవలసివచ్చుచున్నది. ఏమన, నీతఁడు పాండవులు విరటునింట జ్యేష్ఠానుక్రమముగా, ననఁగా ధర్మజుని తరువాత భీముఁడు, భీమునియనంతరమున నర్జునుఁడును, నటుపిమ్మట నకులుఁడును, నంత సహదేవుఁడును, బిదపఁ బాంచాలియుఁ జొచ్చి నట్లు వర్ణించినాఁడు. ఇట్లు చెప్పుటచే వారిని బాండవు లని విరాటాదులు గుర్తుపట్టుట సులభ మగు నని మనవారు తలఁచుచున్నారు. కావుననే యుత్తరదేశమందలి భారతప్రతులలో వ్యుత్క్రమముగాఁ బాండవులు విరటునికొలువులోఁ బ్రవేశించినట్లుగాఁ జెప్పఁబడియున్నది. ఉత్తరదేశప్రతులే కాక, తిక్కనకవిత్వము ననుసరించిన వని తెలుపఁబడిన దక్షిణదేశప్రతులందుఁ దక్కఁ, దక్షిణభారతప్రతు లన్నిటియందును బాండవులు వ్యుత్క్రమముగానే విరటునికొలువు సొచ్చినట్లు చెప్పఁబడినది.............. ఈప్రకారముగాఁ బ్రమాణముగాఁ దీసికొనఁదగిన సంస్కృతప్రతు లన్నిటియందును బాండవులవిరాటసభాప్రవేశమును గ్రమము తప్పించి వ్యుత్క్రమముగాఁ జెప్పియుండఁగాఁ దిక్కనాద్యుఁడుమాత్రము జ్యేష్ఠానుక్రమప్రవేశమును వర్ణించుటలో విశేష మేమియుండఁగలదు? పరికించిచూడ వ్యుత్క్రమప్రవేశము నందే విశేషము గాన్పించుచున్నది. జ్యేష్ఠానుక్రమప్రవేశములో వీరు పాండవు లని తెలిసికొనుటకు నవకాశము గల దనియు, వ్యుత్క్రమ

ప్రవేశములో నట్లు లేమ కాన నిందే విశేషము కల దనియు విమర్శకులు చెప్పుచున్నారు. కనుఁడు." అని బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్ద యాక్షేపణము చేయుచున్నారు.

ఇది యంతపెద్దయాక్షేపణము కాదు. విరటునికొల్వునఁ బాండవులను జ్యేష్ఠానుక్రమముగాఁ బ్రవేశపెట్టినను, వ్యుత్క్రమముగాఁ బ్రవేశపెట్టినను, నీయాక్షేపణము రెండువిధములప్రవేశమునకును వర్తింపకమానదు. భారతప్రతులపాఠాంతరకథనభేదము లటుండనిచ్చి సంస్కృతప్రతు లన్నింటియందును నొక్కవిధముననే వ్యుత్క్రమముగాఁ బ్రవేశపెట్టఁబడియుండె ననుప్రతిపక్షవాదము నంగీకరించినను, నీయాక్షేపణమున కవకాశము లేకపోలేదు. పాండవు లేవురును, వారిభార్య ద్రౌపదియు నొక్కదినముననే విరాటనగరమునఁ బ్రవేశించి, ధర్మజ భీమార్జుననకులసహదేవు లేవురు నొకరివెంబడినొకరు విరాటరాజు కొల్వునకును, నటుపిమ్మట ద్రౌపది విరాటరాజుపట్టపుదేవి యగు సుధేష్ణాదేవికొల్వునకును వచ్చియున్నట్లుగా సకలప్రతులయందును దెలుపఁబడియుండె ననుట వాస్తవ మనుటకు సందియము లేదుకదా!

కురుదేశమునకును మత్స్యదేశమునకును నడుమఁ జాలదూరము కలదు. అందందు దుర్గమారణ్యప్రదేశములు ఘాతుకజంతుపరివృతము లై యుండునవి పెక్కులు కలవు. ప్రజల రాకపోకలకు సులభము లగుదారులు కల వని విశ్వసించుటకు భారతములోనివర్ణనముల వలన సాధ్యపడునది కాదు. విరాటనగరమును బరిపాలించురాజు గాని, వానిపట్టపురాణి గాని, వానిమంత్రివర్గము గాని, వానిప్రజలు గాని, పాండవు లేవురను, ద్రౌపదిని బాగుగా నెఱింగినవా రనిచెప్ప సరిపడదు. అచ్చటిసమాచారము లిచ్చటను, నిచ్చటిసమాచారము లచ్చటను దెలిసికొనుటకుఁ జారులను నియమించి వారిద్వారా తెలిసికొనవలసియుండెను. ఆకాలమునం దట్లే జరుగుచుండెను. విరాట

రాజునకును బాండవులకు నంతకుఁబూర్వమున సంబంధబాంధవ్యము లున్నట్టు భారతమున నెందును జెప్పఁబడియుండలేదు. అందువలన విరాటరాజుగాని, సుధేష్ణాదేవిగాని, పాండవులనుగాని, ద్రౌపదిని గాని యెఱింగియున్నవా రని చెప్ప వలనుగాదు. పాండవజ్యేష్ఠుఁ డగు ధర్మరాజు కౌరవులపక్షమునఁ బ్రతినిధిగా నిలుపఁబడినశకునితోఁ జూద మాడుసందర్భమున, నోడిపోయినవారు పండ్రెండేఁడు లరణ్యావాసమును నొకయేఁ డజ్ఞాతవాసమును జేయుటకుఁ, బందెము నొడ్డి యోడిపోవుటయు సంభవించెను. ఈవిషయము లన్నియుఁ జారులవలన మత్స్యదేశమునందలి ప్రజలును, ప్రభువులును వినియుండవచ్చును. అంతమాత్రముచేతఁ బాండవులయరణ్యావాసవివరములు కాని, యజ్ఞాతవాసమునుగూర్చి వా రేర్పాటుచేసికొన్న పద్ధతులుకాని వారి కెంతమాత్రముఁ దెలియు నని తలంపరాదు. ఇట్లుండఁగా, నరుస నైదుగురుపాండవులు జ్యేష్ఠానుక్రమంబుగను జివరకు ద్రౌపదియుఁ బ్రవేశించి రని చెప్పినచో, వీరు పాండవులు ద్రౌపదియు నని విరాటాదులు గుర్తుపట్టుట సంభవింపవచ్చును గాన, నట్లుగాక చివరఁ బ్రవేశించిన దని చెప్పఁబడినద్రౌపదిని ధర్మజభీములకుఁ దరువాతను బ్రవేశపెట్టినచో నట్లుగుర్తుపట్టుటకు సాధ్యపడ దని తిక్కన నధిక్షేపించిన వారివాదముగూడ నాక్షేపణార్హమును బరిహాసాస్పదముఁగూడ నగుచున్నది. ఏమనఁగా నొకరివెంబడినొకరు వచ్చినవారైనను ద్రౌపది మాత్రము విరాటరాజుకొల్వునకు వచ్చియుండలేదు. ద్రౌపది సైరంధ్రీవేషముతో బయలుదేఱి విరాటనగరముఁ బ్రవేశించి,

"సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱి, నునుగాంతి
గదలిన యమృతాంశుకలయుఁబోలె,
పెనుమంచు మీఁదఁ బర్విన, వికాసము దప్పి
చెలువు గుందినసరోజినివిధమున,

ధూమంబు వొదవినఁ దుఱఁగలిమెఱుఁగులు
నలఁగి మాసినదీపకళికపగిది,
ధూళి పైఁ బొరసినఁ గొంగలించుట మాని
లావణ్య మెడలినలతికభంగి,
తే. గంధకారికావేషంబుకతన, మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱుఁగుపడియుండఁ, బాంచా
తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబు నవ్వెలఁదిఁ జూచి."

అని తిక్కనసోమయాజి ద్రౌపదిని వర్ణింపుచు రాజవీథిని జనుచుండె నని చెప్పినాఁడు. అంతఁ బౌరజనంబులు తమలోఁ దాము పలువిధంబులుగాఁ బ్రశంసించుచు నామెను జేరి,

"కం. నీ వెవ్వ, రేమిపనికై
యేవలనికిఁ బోవుచునికి యిది; నావుడుఁ, న
ద్దేవియు సౌముఖ్యము సం
భావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్.
ఆ. ఏను గట్టువాలుదాన నా కెవ్వరు
గడుపుకూడు వెట్టి కట్టఁ జీర
యిచ్చి సాకతమున సేలుదు రట్టివా
రలకుఁ బనులు చేసి మెలఁగుబుద్ధి."

అని ప్రశ్నించినవారికిఁ దగువిధమున సమాధానము చెప్పుచుఁ గనుంగొనుచు ముసరికొని చనుచుండ రాజమందిరంబు చక్కటికి నరుగునవసరంబునఁ దనరమ్యహర్మ్యముతుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారాస్పద మగునెలవున మెలఁగెడివిరటునిపట్టపుదేవి యగుసుధేష్ణ పాంచాలరాజనందనఁ గాంచి యామెను దనకడకు రప్పించుకొని కుశలప్రశ్నంబు లడుగుచు నామెవలనఁ బ్రత్యుత్తరములను బొంది యాదరబుద్ధితోఁ దనకొల్వునఁ దనసేవకై నిలుపుకొన్నట్లుగాఁ దెలుపఁబడినది.

పాండవు లేవురు ప్రచ్ఛన్నవేషములతో విరాటునికొల్వుకూటమునకుఁ బోయినవిధముగాని, యక్కడ వారలు కొలువున కమరిన

విధముగాని విరటునిపట్టపురాణి యగుసుధేష్ణకుఁగాని, యంతఃపురము లోని సతీజనంబులకుఁగాని తెలియరాదు. అట్లే విరాటరాజునకుఁ గాని, యాతనిమంత్రివర్గమునకుఁగాని, తదితరోద్యోగియులకుఁగాని మాలిని యనుపేరిట సైరంధ్రీవేషముతో ద్రౌపది సుధేష్ణసన్నిధాన మునకు వచ్చి యామెకొల్వు నమర్చుకొన్నవిషయము దెలియరాదు. ఇట్టిసందర్భములోఁ బాండవులను దిక్కనసోమయాజి జ్యేష్ఠానుక్రమ ముగాఁ బ్రవేశపెట్టినను, సంస్కృతశ్రవ్యకాలలోఁ గొన్నింటిలోవలె వ్యుత్క్రమముగాఁ బ్రవేశపెట్టినను, ఫలిత మొక్కటియే యగునుగాని భిన్నముగా నుండఁజాలదు. ద్రౌపది ధర్మజభీములతరువాత వచ్చిన దన్నను, పాండవు లేవురతరువాతను గడపట వచ్చినదన్నను విరుద్ధ ముగా నుండుభేద మేమియును గానుపింపదు. విరటునకును విరటుని కొల్వున నున్నవారికి నాదినమున ద్రౌపది గానుపింపనే లేదు. విరటుని రాణి యగుసుధేష్ణాదేవి కాదినమున ద్రౌపదిభర్త లేవురు విరటుని గొల్వవచ్చి రనువిషయము దెలియనే తెలియదు. కావున ద్రౌపది నెట్లుప్రవేశపెట్టినను పాండవు లెఱుకపడి చిక్కు కలుగు ననుకొనుట కవకాశము లేదు. ఇంకను పాండవులేవురలోను భీమునితరువాత సహదేవుని, వానియనంతరమున నర్జునుని, పిదప నకులుని బ్రవేశ పెట్టుటవలన నెద్దియోచమత్కారము గల దని యనుకొనుటకుండ వట్టిభ్రమయే యగును. అర్జునుఁడు పురుషస్వరూపమును గాక స్త్రీ స్వరూపమును గాక, యుభయస్వరూపచిహ్నములుం గల యొక వికారపుపేడిరూపము ధరించి వచ్చినవాఁడు. అతనిని దిక్కనసోమ యాజి నకులునికిముందు ప్రవేశపెట్టినను, గొన్నిప్రతులలోవలె సహ దేవునకు, నకులునకునడుమఁ బ్రవేశపెట్టినను నందుఁ జమత్కారము గాని విశేషముగాని యేమియుఁ గానరాదు. ఇట్టిపేడిస్వరూపుఁ డగు నర్జునుని దిక్కనవలె భీమునితరువాతఁ బ్రవేశపెట్టిన నర్జునుఁ డని

గుర్తుపట్టుట కవకాశ మిచ్చునేని, సహదేవునితరువాతఁ బ్రవేశపెట్టిన నట్టియవకాశ మీయకుండునా? ద్రౌపదీస్వయంవరమునకుఁ బోయిన విరాటరాజు, విప్రవేషముతో నుండి మత్స్యయంత్రమును గొట్టినప్పుడు వాని నర్జునునిగాఁ దెలిసికొనఁజాలకుండెను. అట్టివాఁడు తనయెట్ట యెదుట షండరూపమున నున్నవాని నర్జునునిగా గుర్తింపఁగలుగునా? అదెక్కడిమాట? భీమునకుఁదరువాతఁ బ్రవేశపెట్టినను నకులసహదేవులకునడుమఁ బ్రవేశపెట్టినను నొక్కవిధముగానే తోఁచును. వాస్తవముచేత సులభముగా గుర్తింపఁబడఁదగినవాఁడు వంటలవానివేషముతో నున్నభీముఁడు. అట్టిభీమునే గుర్తింపఁజాలనివారు వినికిడిమాత్రమున వీరిని పాండవులని గుర్తింపఁగలరా? దీనినిబట్టి మన కేమిబోధపడుచున్నది? విరాటరాజుగాని వానిమంత్రివర్గమువారుగాని పాండవుల నెఱింగియుండరనియు, వినికిడిమాత్రముచేతనే పాండవుల యరణ్యావాసాజ్ఞాతవాసములచరిత్రమునుమాత్రము వినియుండవచ్చుననియును. అంతమాత్రముచేత జ్యేష్ఠానుక్రమముగాఁ బ్రవేశపెట్టినను, వ్యుత్క్రమముగాఁ బ్రవేశపెట్టినను, వీరే పాండవు లని గుర్తుపట్టుటకు నవకాశము చాలదు. సహదేవుని నడుమఁ బ్రవేశపెట్టినను, నకులునిఁ దుదను బ్రవేశపెట్టినను భేద మేమియును గానరాదు. నిజముగా విరాటాదులు పాండవులేవురను గుర్తెఱింగినవారే యైనయెడల, నేక్రమము ననుసరించివచ్చినను నొక్కదినముననే, యేవురు నొకరివెంబడినొకరు, వచ్చినవారగనుకను, నేవురును బ్రచ్ఛన్నవేషములతో వచ్చినవారు గనుకను, వారిని సులభముగాఁ బాండవులేవురనుగా గుర్తింపవచ్చును. కాని, వారివారిస్వరూపాదులును స్థితిగతులు నంతగా వీరికిఁ దెలియరావని మనము దృఢముగా విశ్వసింపవలసియున్నది. కాని యీసందర్భమున బ్రహ్మయ్యగారు తిక్కనయెడ స్వవచనవ్యాఘాతదోషము నొకదానిఁ బ్రశంసించియున్నారు. అందునుగూర్చికూడ నొకింత ప్రత్యుత్తరముఁ జెప్పెదను.

"ఇవియున్నియు నిట్లుండఁగాఁ బాండవులు జ్యేష్ఠానుక్రమముగా విరటుకొల్వు సొచ్చిరనుటలో నొకదోషము కలదు. దానిని మన తిక్కమఖిగాని, మనవవిమర్శకులుగాని కనుఁగొనలేదు. ఏమన— నీక్రమము తిక్కనచే వ్రాసినయుత్తరగ్రంథమునకు విరుద్ధముగా నున్నది. కీచకుని వధించుటనుగూర్చి ద్రౌపదీభీములు మాటలాడుకొనుటలో ద్రౌపది భీమునితో 'మనముభయులము విరటునికొల్వునకు వచ్చినసమయ మొక్కటియే కావున సుధేష్ణాదులు మనకిద్దఱకును సంబంధ మున్నట్లు తలంచి' రని చెప్పినది. తిక్కనపద్యముం గనుఁడు.

"కం. పలుకుదు రెస మాలినిచూ
డ్కులలెల్లఁ గదఁ బొందుఁ గలిపెదుం గంటిగె వీ
రలు వచ్చినసమయంబును
దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొక్కో."

భీముఁడు, ద్రౌపది సమకాలమున వచ్చిన ట్లిచ్చటఁ జెప్పినతిక్కనార్యుఁడు మొదటఁ బాండవులు జ్యేష్ఠానుక్రమముగఁ బ్రవేశించిన ట్లెట్లు చెప్పెను? ఇది స్వవచనవ్యాఘాతదోషముతోఁ గూడుకొనినదికాదా? తప్పక యిది దోషమే. కానఁ దిక్కనవ్రాఁతనుబట్టియే పాండవులవిరటుకొలప్రవేశము వ్యుత్క్రమముగా నున్న దని యూహింపఁదగుచున్నది." అని విమర్శకులు వ్రాసిరి. ఇందుఁ దిక్కనగారిస్వవచనవ్యాఘాతదోషము నా కెంతమాత్రముఁ గానరాదు. "సుధేష్ణాదులును దత్పరిజనంబులును దమలోన నీకును నాకును సంబంధము కల దని లే దని పెక్కువిధంబుల నూహాలు చేసి గుజగుజలు వోవుచుండుదు' రని ద్రౌపది భీమునితో మొఱపెట్టుకొనుసందర్భమునఁ జెప్పినపద్య మిది. దీనినిబట్టి యియ్యది స్వవచనవ్యాఘాతదోష మని బ్రహ్మయ్యగారు తిక్కనగారినెత్తిపైఁ బెట్టి యాతనిం గేలిసేయవలె నని సంకల్పించిరి కాని యింతమాత్రమున నాప్రతిభావంతుని కావ్యకళాదృష్టి కావంతయుఁ గళంకము కలుగఁబోదు. పాండవులెల్లరును ద్రౌపదియు

నొక్కదినంబుననే, యొక్క పూఁటనే వచ్చినవారు. "వచ్చినసమయంబును దలఁపఁగ నొక్కటియ" యని దెలుపునపుడు, సమయ మనఁగాఁ, గాలము, లేక దిన, మని సామాన్యార్థము చెప్పికొన వలయునే కాని, భీముని వెంట ద్రౌపదిగాని, ద్రౌపది వెంట భీముఁడు గాని, లేక యిరువురు జంటగఁగాని యొకసారియె వచ్చి రని యర్థము కాఁజాలదు. సంస్కృతప్రతులయందును నట్లు వ్రాయఁబడియుండ లేదు. కీచకునిచేఁ బరిభవింపఁబడినద్రౌపది, సుధేష్ణయుఁ దత్పరిజనంబులును దమ్ముఁగూర్చియుఁ దమకుంగల సంబంధమునుగూర్చియు గుసగుసలువోవుచుఁ జెప్పికొనుమాటలను దెలుపుచుఁ, దనపరిభవాతిరేకమునకుఁ గనలి యుద్రేకించినయెడలఁ, దమ్మునిరువుర భేదింతురు గాన 'నీకుఁ దోఁచినభంగి రహస్యభంగము గాకుండ శత్రుసంహారము చేయు' మని భీమునిఁ బ్రోత్సహించుచు నాతనితో ద్రౌపది తెలియఁ జెప్పుసందర్భమునఁ జెప్పినపద్య మది కావునఁ దిక్కనకు స్వవచనవ్యాఘాతదోషము పట్టిన దనుట దుర్భ్రమ కాని, యథార్థము గ్రహించిన వారి కట్టిది కాదని విస్పష్టము కాఁగలదు. కాన "తిక్కనవ్రాఁతను బట్టియే పాండవులవిరటుకులప్రవేశము వ్యుత్క్రమముగానున్న దని రూఢిపడుచున్న" దనుట వట్టి నిరర్థకమైనదిగాఁ దలంపవలసియుండును. "తిక్కనార్యుఁడు వ్రాసిన యీవ్రాఁతంబట్టి ధర్మజుఁడు, భీముఁడు, ద్రౌపది ప్రవేశించినతర్వాత మిగిలినవారు ప్రవేశించినట్లు తేలుచున్నది. ఇదియే హాని లేనిపాఠము." అని వ్రాయుట తిక్కనయెడ నపరాధమును మోపుటకంటె మఱొండు కాఁజాలదు. ఇంకఁ బాండవులప్రవేశమును గూర్చినచర్చను ముగించి, వారు వేసికొన్న వేషములను గూర్చియుఁ జేసినప్రసంగములను గూర్చియుఁగూడ నొకింత చర్చింతముగాక.

# నాల్గవ ప్రకరణము

## తిక్కన కావ్యకళాదృష్టి

## పాండవుల వేషభాషాదులవర్ణనము.

"ఉభయభాషాకవిమిత్రుని యుభయభాషాసంపూర్ణప్రవీణత పుస్తకమునం దెక్కడఁజూచినను విస్పష్టముగాఁ దెలియుచున్నది" అని మనవిమర్శకాగ్రేసరులు తిక్కనభావవిషయమై నిష్కళంకాభిప్రాయమును వెలిబుచ్చుచున్నను దిక్కనసోమయాజి వెల్వరించినభావములనుగూర్చి చేసినవిమర్శనమాత్ర మొకింతవికటముగాఁ గన్పట్టుచుండును. పాండవుల వేషభాషాదులఁ గూర్చినవర్ణనములో నొక్కకంకభట్టువేషమును ధరించిన ధర్మజునిపాత్రమునుగుఱించిమాత్రము మన కాశీభట్టవారికిఁ బ్రశంసింపక తప్పినదికాదు.

"భీమార్జుననకులసహదేవులు విరాటునిపురములోఁ బ్రవేశింప వేసికొనినవేషములు, నచటఁ గావించినప్రసంగములును బాగుగా నున్నవి. భీముని వంటలవానివేషము, మాటలును జూడుఁడు! ఎంత యింపుగా నున్నవో! అర్జునుని వేషమును బ్రసంగమును భాగుగనే యున్నవి. విరాటుం డొకప్రభువుగాఁ జిత్రింపఁబడుటలేదు. ఎందులకుం బనికిరానియేబ్రాసిగాఁ జిత్రింపఁబడినాఁడు. ప్రభుత్వాశీవి లేదు. తెలివితక్కువప్రసంగము లెచ్చు. కనఁబడినవానికెల్ల 'నారాజ్యము నీ కిచ్చెదను, నీవేలుకొ' మ్మనుచువచ్చినాఁడు. ప్రభుత్వ మొనరింపఁ దగనివాఁడని దీనివలనఁ దేలుచున్నది." అని కాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగారు భీమార్జుననకులసహదేవులపాత్రములను మెచ్చుకొనుచు, విరాటుని పాత్రాభివర్ణన మిట్లున్న దనిమాత్రము వక్కాణించిరి కాని, యందును

గూర్చి తమయభిప్రాయమును విస్పష్టముగఁ దెలుపుచుండలేదు. ఈవిషయ మటుండనిచ్చి ధర్మజుఁడు ధరించినకంకభట్టువేషమును గూర్చియు, వానిప్రసంగములను గూర్చియు, నొకింత ముందుగాఁ జర్చింతము. ఈయపూర్వవిమర్శకు లగు కాశీభట్టవారికిఁ గంకభట్టు పాత్ర మభిమానపాత్ర మని వీరు గావించెడుప్రశంసవలననే విదితము కాఁగలదు. తమ కత్యంతాభిమానము గల కంకభట్టుపాత్రమును దిక్కనసోమయాజి పాడుచేసె నని గోలపెట్టుచున్నారు. చూడుఁడు!

"ఉత్తర దేశప్రతులలో ధర్మజుఁడు బ్రాహ్మణవేషముతో విరటునికొల్వు సొచ్చె నని యున్నది. మనతిక్కనార్యుఁ డాతనికి బ్రాహ్మణసన్న్యాసి వేషమును సమకూర్చె. ధర్మదేవతామహిమముచే, నున్నయునికిన, యుధిష్ఠిరునకు బ్రాహ్మణసన్న్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యై తనవైపునకు వచ్చుచుండఁగా దూరమునుండి కని విరాటుండు —

"సీ. కరచరణాద్యంగకము లేలొకో రత్న
భూషణప్రకరంబుఁ బొందుఁ దొడఁగె,
నుభయపార్శ్వంబుల నిభఘట లేలొకో
చనుదేవు సముదాశ్రిసమితి మొరయఁ,
బాయు, కొలంగుమం, చాయతవేత్రిహ
స్తులమొత్త మేలొకో తోడ రాదు,
ధవళాతపత్రముల్ తఱచుగా నేలొకో
పట్టరు మాత్తికప్రభలు వెలుఁగ,
నితఁడు రాజగు, రా జను నింతమాత్ర
గాదు, మూర్ధాభిషిక్తవర్గంబుఁ దనదు
చరణయుగ్మంబుఁ గొలిపింపఁ జాలుసార్వ
భౌముపదవికిఁ దగియెడుభంగివాఁడు."

అని వర్ణించినట్లు తిక్కనార్యుఁడు వ్రాసియున్నాఁడు. ఇది యసంగత వర్ణనముగాఁ గాన్పించుచున్నది. ఏమన, దూరముననుండి, యావచ్చు

చున్నవాఁ డెవ్వరో విరటుఁ డెఱుంగఁడు. ఆతని కీతఁడు క్రొత్త
వాఁడు. రూపమున్ననో సర్వవిధముల బ్రాహ్మణసన్న్యాసివేషమునఁ
గలదు. ఇట్టివిప్రయతిం గని, విరాటుం, డీతనితో నేనుఁగుల
గుంపు లేల రావు? వందిమాగధు లేల రారు? ఛత్రచామరము లేల
లేవు? ఈతనికరచరణాదులందు రత్నభూష లేల లేవని శంకించుకొ
నుట కవకాశ మెక్కడనుండివచ్చినది? 'ఒకగోవుం గని దీనికిఁ దుండ
మేల లేదు? కుంభము లేల కానరావు? దంతము లేల పొడకట్ట
వనుట యెట్టిదియో నిదియు నట్టిది కాదా? విప్రసన్న్యాసికిఁ గరచర
ణాదులందు రత్నభూష లెట్లుండును? వందిఘోష లెట్లుకలుగును?
ఇభఘట లెట్లువచ్చును? ఛత్రచామరంబు లెట్లుసంప్రాప్తమగును?
కంకునిపూర్వావస్థంబట్టి యీవర్ణనములు గావించె నందురా? దాని
విరాటుఁ డెఱుంగఁడుగదా! ఆవిప్రయతియందు బ్రాహ్మణయతిచిహ్న
ములకంటె సార్వభౌమచిహ్నములు హెచ్చుగాఁ గాన్పించుచున్న
వందురా? ధర్మదేవతామహిమముచే ధర్మరాజునకు సమయరక్షణా
ర్థమై విప్రసన్న్యాసిరూపము వచ్చిన దనిన నర్థ మేమి? అది వట్టి
కృత్రిమవేషధారణము కాదే! దైవమహిమచేఁ గలిగిన రూపవిశే
షమే! అట్టిరూప మడుగంటిపోయి గుట్టునుమట్టును జెడఁగొట్టుక్షత్రియ
సార్వభౌమత యెట్లు విరాటునకుఁ గాన్పించినది. పగటివేషములు
వేయువారలు కృత్రిమములుగా ధరించువేషములుగూడ సరిగ నిర్దే
శితవేషమునే తోఁపఁజేయును గదా! అట్టిస్థితిలో దైవాయత్త మగు
నీవిప్రరూపమును దూరమునుండి చూచిన యపరిచితులకుఁగూడ
సార్వభౌమత్వమును సూచించిన దనిన దైవమహిమములోఁ గొఱఁత
కల దనియే చెప్పవలసియుండును గదా? బ్రాహ్మణవేషము సరిగ
లేదనియే యనవలెను గదా! ధర్మజాదులనిజరూపములు కప్పుపడి
పోయి క్రొత్తచిహ్నములు కలిగి వారియజ్ఞాతవాసము నిర్బాధకముగా.

సాగుటకేకదా ధర్మదేవత యారూపముల ననుగ్రహించె! అవి సరిగ లేవనుట యసంగతము కాదా? కాన, తిక్కనార్యుఁ డొనర్చిన యీవర్ణన మెంతమాత్రమును సరిగ లేదు. ఇది యొకప్రమాద మనక తప్పదు. సమయభంగకరముగా నున్నది. కథకు సందర్భించి లేదు. ధర్మజునందలిసార్వభౌమత్వము పోయి చాలకాల మైనది. అదిగాక యతఁ డప్పుడప్పుడు బ్రాహ్మణవేషములో నుండుట వాడుక. ద్రౌపదీ స్వయంవరాదిసమయములందుఁ బాండవులు విప్రవేషములలోనే యున్నారు. వారిసార్వభౌమత్వమును, ననఁగాఁ జక్రవర్తికులజత్వ మును నప్పు డెవ్వరును గనుఁగొనియుండలేకపోయిరి. అట్టిస్థితిలో ధర్మజునివిప్రసన్న్యాసివేషమును దవ్వులనుండి చూడఁగనే, పూర్వా పరసందర్భము లేమియు నెఱుంగనివిరాటుఁ డాతనియందు, సార్వభౌ మత్వమును గనిపెట్టుట వింత! మూలమునందుఁగూడ నిట్టివర్ణనము కలదు. కాని యదియు నసంగతము. మూలమునం దున్నలోపములను దిద్దివేసి చక్కఁగా వ్రాయుటకుఁ బూనుకొనినతిక్కనార్యుఁడుకూడ ధర్మజునకు దైవమహిమముచేఁ గలిగినరూపవిశేషమును మఱచిపోయి యెప్పుడో యాతనియం దుండినసార్వభౌమత్వమును మనస్సునకుఁ దెచ్చుకొని యీవిప్రయతియందు ఛత్రచామరాదికలితత్వాదు లేల లే వని శంకింపించుట వింతగా నున్నది. ఈవర్ణనము తప్పు."

ఈవిమర్శకాగ్రేసరునివిమర్శమునకు గ్రంథకర్త చెప్పనిదానిని జెప్పినట్లుగాఁ బ్రశంసించుటయుఁ, జెప్పినదానిని జెప్పనట్లు ప్రశంసించు టయు మూలసూత్రముగా నుండును. "ధాతుపటదండకమండలకలిత మూర్తి యై తనసైపునకు వచ్చుచుండఁగా దూరమునుండి కని విరా టుఁడు" అని తిక్కన వ్రాయనివిశేషణమును దాను కల్పించు చున్నాఁడు. తిక్కన యతీంద్రుఁ డనిమాత్రము చెప్పినాఁడు. ఆతని పద్యమును జూడుఁడు.

"ఉ. దవ్వులఁ జూచి మత్స్యవసుధాపతి యాచనుకెంచుచున్నవాఁ
డెవ్వఁడొ నాదుచూడ్కులకు నెంతయు వ్రేఁగయి తోఁచె నెట్టిదం
డివ్విధిఁ బొందెనో జగము లెల్లను నేలఁగఁ జాలుతేజ, మా
మువ్వురతోడిజోడి యగుమూర్తి, యతీంద్రునియొప్పుఁ గంటిరే!"

విరటుఁ డీయతీంద్రుని దూరమునుండి చూచి యిట్లా వచ్చుచున్నవాఁ డెవ్వఁడో కాని నాచూపులకు మిక్కిలి వ్రేఁగయి తోఁచుచున్నాఁడు. ఎందుచేత నీరీతి నున్నాఁడో? సమస్తప్రపంచమును బరిపాలన చేయు శక్తి గలతేజస్సు; బ్రహ్మవిష్ణుమహేశ్వరులతో సమానమగురూపము గలవిగ్రహము; ఈయతీంద్రునిసౌందర్యమును జూచినారా యని తన వారిని హెచ్చరించునట్లుగాఁ దెలిపియున్నాఁడు ఇతఁడు సామాన్య యతిగాఁ గన్పట్టలేదు గనుకనే విరటునకుఁ దైవికముగాఁ గనుపట్టె నని తిక్కన వర్ణించియున్నాఁడు. జగములనన్నిటిని బరిపాలించు తేజస్సాతని మూర్తియందుఁ గనుపట్టుటచేతనే, యాతనికిఁ బరవశత్వమును బుట్టించి యాతనిభావములను మిన్నంటింపఁ జేసినది. అతఁడు యతీంద్రవేషమును జేసికొనివచ్చినను, సార్వభౌమపదవి కర్హుఁడైనవానిఁగ వానితేజస్సు తేటపడుచుచున్నదనుటలో వింత యేమియును లేదు. యతీంద్రునిలో నున్నయాతేజస్సే విరటునిహృదయము నాకర్షించినది. అది దైవమహిమ మని యేల యనుకొనరాదు? తిక్కన యుత్తరదేశ భారతప్రతులననుసరించి ధర్మజునకు విప్రవేషము నమర్చిపెట్టక తన కాలమునాఁటి దక్షిణదేశప్రతుల ననుసరించియే ధర్మజునకు యతీంద్ర వేషము నమర్చిపెట్టినాఁడు. అంతియకాని తాను స్వతంత్రించి యీ మార్పును దెచ్చినవాఁ డని యూహింపఁజాలము. విరటుఁడు యతీంద్రునియందు నొకదివ్యతేజస్సును గనుటచేతనే యాతఁ డొకసార్వభౌముఁడుగ నుండువాఁ డని భావించి, యొంటరి వచ్చుచుండుటచేతఁ, "కర చరణాద్యంగకము లేలొకో రత్నభూషణప్రకరంబుపొందుఁ దొఱఁగె"

ననుసీసపద్యమున వర్ణించినవిధముగా రత్నభూషణముల, నిభఘటలను, నేత్రహస్తులను, ధవళాతపత్రములను ప్రశంసింపుచు, నయ్యవి లేవేమి యని శంకించుట సంభవించెను. ఇం దొకవిధమైన కవితాచమత్కారము కానంబడుచున్నయది. కవిహృదయముఁ దెలిసికొనుట కవికే సాధ్యమగును గాని కవితావాసన యించుకయు లేక చొప్పదంటుప్రశ్నలను జేయుదుర్విమర్శకుల కంతగా బోధపడు నని యూహింపఁజాలము. తిక్కనసోమయాజివర్ణన మసంగతము కాదు. గ్రుడ్డిలోమెల్లయన్నట్లు మూలగ్రంథమునఁగూడ నిట్లే వర్ణింపఁబడినది. అదియు నసంగత మనిరి. గుడినిమ్రింగువానికి గుడిలోనిలింగ మొకలెక్కలోనికి రాదుగదా! మూలభారతగ్రంథకర్తనే ధిక్కరింపఁగలిగినవారికిఁ దిక్కనసోమయాజి యెంతటివాఁడు? ''మూలమునం దున్నలోపములను దిద్దివేసి చక్కఁగా వ్రాయుటకుఁ బూనికొనిన తిక్కనార్యుఁడుకూడ ధర్మజునకు దైవమహిమముచేఁ గలిగినరూపవిశేషమును మఱచిపోయి యెప్పుడో యాతనియం దుండినసార్వభౌమత్వమును మనస్సునకుఁ దెచ్చుకొని యావిప్రయతియందు ఛత్రచామరాదికలితత్వాదు లేల లేవని శంకింపించుట వింతగా నున్నది'' యనుదానికి యతీంద్రునుండి కనుపట్టిన దివ్యతేజస్సే కారణ మైయుండెే నని యిదివఱకె గ్రహించియున్నాము. దానిని గ్రహింపఁజాలక విమర్శకులు ప్రస్తావించి పలుసారులు వ్రాయుచుండుటచేత నూఁకదంపుపాట కెంతఫలిత ముండునో దీనికి నంతేఫలితము. ధర్మజుఁడు యతీంద్రవేషము దాల్చుట దైవమహిమముచేతనే యని మఱొకమాఱు తెలియఁజెప్పుచున్నాము. అతని మహిమముచేతనే విరటుఁడును వానివారును యతీంద్రునియందు దివ్యతేజస్సును గనుఁగొనుట సంభవించినది. విరటునిమనంబున కాతనిఁ జూచినవెంటనే సార్వభౌమపదవి కర్హుఁడైనవాఁ డని తోఁపించినది కూడ దైవమహిమమే కావలయును, అట్టివినిర్మలభావ మంకురించిన

తోడనే యిట్లు తలపోసికొనియెను. "ఎందునిమిత్త మాతఁ డిచ్చటకుఁ జనుదెంచుచున్నాఁడో? ఈమహాత్ముఁడు చెప్పినపను లన్నియుఁ జేయుదును. ఇతఁడు కోరినయెడలఁ దృప్తితీరఁ గనకాంబరముల నిత్తును. ఇంతియకాదు. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుఁడు కాఁదలంచెనేని వినమ్రుఁడనై భక్తిగౌరవములు తేటపడునట్లుగాఁ జేసి, యమాత్యసుతసుహృద్భటార్యయుతముగా నతనికి సేవ చేయుదు" నని చెప్పెను. అట్లాతఁడు యతీంద్రుఁ డని విశ్వసించిన దొక్క విరటుఁడు మాత్రమే కాదు. విరటునికొల్వుకూటమున నున్నవారికెల్లరకు నట్లే కనుపట్టెను. అట్టిది యాదివ్యతేజోమహిమము కాదా? విరటుని కొల్వునం గలసమస్తజనంబు లాయతీంద్రునియెడఁ గల్గినభక్తియుక్తిం జేసి ప్రత్యుత్థానము సేయ, విరటుండును గద్దియ డిగ్గి, యెదురు సని, నమస్కరించి యాతనియాశీర్వాదంబులు గైకొని, సగౌరవముగాఁ దోడ్కొనిచనుదెంచి, సముంచితసమున్నతాసనమున నునిచి, వినయావనతుండై కుశలప్రశ్నంబు లడుగుటకుఁ బ్రారంభించెను. ఈసందర్భమునఁ దిక్కనగారిభారతము నొకించుకకాలము దూరముగా నుంచి కాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగా రెంతో మెచ్చుకొన్న యుత్తరదేశభారతప్రతులలో విప్రవేషమును దాల్చినధర్మజుని విరటుకొల్వుకూటప్రవేశమునందలి యనౌచిత్య మెంతహాస్యాస్పదముగ నున్నదో చదువరుల కొకింత విశదపఱుపవలసియున్నది. ఉత్తరదేశభారతప్రతుల కనుగుణముగాఁ దెలిఁగింపఁబడిన దనుతలంపు కలిగియున్నట్టి కృష్ణభారతమునుండి దృష్టాంతము చూపఁగలము. విప్రవేష మెట్లువర్ణింపఁబడినదో చూడుఁడు.

"సీ. చీలమండలు మోయఁ జిఱుపింజలను దీరి
నీర్కావిధోవతి నిగ్గు లీనఁ
బలుపు మీఱెడు దర్భముడియుంగరముతోడఁ
గుశపవిత్రము తేలఁ గొమరుమిగుల

నుదుట, బాహుద్వయి, నుదరంబునందును
భస్మత్రిపుండ్రముల్ పరిఢవిల్ల
వెండితీవలునాఁగ విరియబారిన జన్ని
దములు భుజంబుపైఁ దళుకు లొత్త
తే. నుత్తరీయము చెంగుల నుత్తమముగ
నక్షములఁ గట్టి కక్షములందుఁ బెట్టి
నివురుగప్పిననిప్పునా నెఱిఁ దలిర్చి
నృపతి కొలువుండు చోటికి నేగుటయును."

ఈబికారిబ్రాహ్మణవేషమును దాల్చి వచ్చుచున్నవాని, విరటుఁడు దవ్వులఁ జూచి దగ్గరనున్నవారికి వినంబడునట్లుగా, సీ

"పురుషుఁ డెవండొ బ్రాహ్మణునిపోలిక గా దిది లోక మేలఁజా
ల్గొర యని కాక దేవుఁ డని తోఁచెను ప్రేఁగయి నాదుచూడ్కికిన్."

అనియు,

"ఉ. ఈచనుదెంచువాఁ డరయ నెల్లవిధంబులఁ జక్రవర్తినాఁ
దోఁచెను గాని సేవకులు తోఁ జనుదే రదియేమొ కొన్నియేన్
రాచతికంపుకేవ లవి రా వదియేమొ రథేభవాహముల్
చూచినఁ గానరావు కడుచోద్య మి దేమివిశేషమో ?..."

అనియు; వాని నొకచక్రవర్తిగా భావించుచున్నాఁడు. ఈబిచ్చపుబ్రాహ్మణుని, వీనివేషమును, జూచినమాత్రముచేత, "నితఁ డెల్ల విధంబులఁ జక్రవర్తినాఁ దోఁచె"నఁట విరటునకు. ఇదెంతయు బ్రహ్మయ్యశాస్త్రిగారికి సముచితముగాఁ గనుపట్టుచుండెనుగాఁబోలు ! ఎంతవిపరీతము ! అంత, విరటుఁ డేమిచేసెనో, ఆబ్రాహ్మణుఁ డెట్లు ప్రవర్తించెనో యొకించుక చిత్తగింపుఁడు.

అట్లు విరటుఁడు వితర్కించుచు డోలాయమానమానసుండై గద్దియమీఁదఁ గూరుచుండియుండఁగానే యుధిష్ఠిరుండు విరాటుకొల్వుకూటంబునకుఁ దఱియవచ్చి యతనిదిక్కు మొగంబై యిట్లనిదీవించెను,

"తే. జయము జయము మహారాజచక్రవర్తి
నిస్స్వుఁడ, ద్విజుండ నష్టసర్వస్వుఁడ నిట
వచ్చితిని జీవనార్థినై వసుమతీశ
పాల వసియింపఁ జిత్త మేపగిది గలదొ ?"

అంత, విరాటుండు ప్రత్యుత్థానంబు స్వాగతంబు వలికి ప్రతిగ్రహించి కుశలప్రశ్నంబు లడుగుటకుఁ బ్రారంభించెను.

చూచినారా! అచ్చటఁ దిక్కన తనభారతములో యతీంద్రునియందుఁ బ్రజ్వలింపఁజేసినదివ్యతేజ స్సిచ్చట బ్రాహ్మణునియందుఁ గన్పట్టలేదు. సాధారణబ్రాహ్మణుఁడుగాఁ గన్పట్టువానిని విరటుఁడు చక్రవర్తిగా భావించుట వింతవిషయము. భావించినను గౌరవ మించుకయుఁ జూపక మిడిగ్రుడ్లు పెట్టుకొని చూచుచుండ నాతఁడే విరటుని సమీపించి యొకసామాన్యభట్రాజువలె 'జయము, జయము, మహారాజచక్రవర్తి' యని సంబోధించుచు, 'దరిద్రుఁడను, బ్రాహ్మణుఁడను, సర్వస్వమును బోఁగొట్టుకొన్నవాఁడను, జీవనార్థినై యిట వచ్చితిని రాజుగారికొల్వున నుండుటకు, దేవరవారిచిత్త మెట్లనుగ్రహించునో' యని మొఱవెట్టుకొన్నట్లుగా వర్ణింపఁబడియెను. ఈప్రవేశఘట్టము తిక్కనభారతమున వర్ణించుసందర్భమున నౌచిత్య మెక్కువగాఁ బాటింపఁబడినది. ధర్మజునిపాత్రమును విరటునిపాత్రము నౌచిత్యమునకు భంగము లేకుండఁ జక్కఁగాఁ బోషింపఁబడినవి.

కృష్ణభారతములో ధర్మజునిపాత్రమును, విరటునిపాత్రమును, బూర్ణముగాఁ జెడిపోయిన వనుటకు లేశమాత్రమును సందియము లేదు.

తిక్కనభారతములోని యతీంద్రునిలోఁ గన్పట్టునట్టి యాత్మగౌరవ, గంభీరభావము లుత్తరదేశభారతప్రతులలోని, తదనుగుణముగా భాషాంతరీకరింపఁబడిన కృష్ణభారతములోని, విప్రవేషధారి

యందుఁ గన్పట్టవు. విరటుఁడు తన్నాదరించి యుచితాసనము నొసంగి తనయూరు, తనపేరు, తనకులము, తనవృత్తినిగూర్చి యెట్టిప్రసంగమును జేయకముందే తనంతటఁదాను రాజును సమీపించి భట్రాజువలెఁ గైవారములు సేయుచుఁ దనదీనావస్థను వెళ్లఁబోసికొనుచు దీనాలాపము లాడుటలో నేమియౌచిత్య మున్నది? బిచ్చగానికి వీనికి భేద మేమి?

"కం. ఏదేశంబున నుండుదు
ఱేదికులం బేదిగోత్ర మేరాజుకడన్
మీదర్శనంబు మున్నగు
నేదివ్యకళారహస్య మెఱిఁగితి రీరల్."

అని విరటుఁడు విప్రుని ప్రశ్నించినట్లుగాఁ గలదు. బ్రాహ్మణవేషము విస్పష్టముగాఁ గాన్పించునపుడు, వెఱ్ఱివెంగళప్పవలె 'నేదికులం' బని మరలఁ బ్రశ్నించుట యెందులకు? తిక్కనభారతమునందు:—

"ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూ
పయ్యది నావుడున్ నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డిట్లనున్."

అని విరటుఁడు యతీంద్రుని ప్రశ్నించిన ట్లున్నది. ఆకాలమున యతులలో వ్రాత్యయతులుఁగూడఁ గలరు కావున విరటుఁడు యతీంద్రుని "కుల మెయ్యది" యని ప్రశ్నించుటలో దోషముగాని, యాక్షేపణముగాని యిసుమంతయుఁ గన్పట్టదు. అట్లు ప్రశ్నించునపుడు, బ్రాహ్మణసన్న్యాసి యని తెలిసికొనియున్నప్పుడు, 'కుల మెయ్యది' యని ప్రశ్నింప నేల యని బ్రహ్మయ్యశాస్త్రిగారివంటివిమర్శకు లడుగవచ్చును. కాని యాకాలమున ద్విజులలోమాత్రమె కాక వ్రాత్యులలోఁగూడ యతులు కలరు. కావున నిచట యతీంద్రునికుల మడుగుట యాక్షేపణీయము కాదు. అట్లు విరటునిచేఁ బ్రశ్నింపఁబడినప్పుడు

సైతము నాత్మగౌరవమును విడువక, వెంటనే ప్రత్యుత్తరమును జెప్పక మిక్కిలిచమత్కారమును గనుపఱిచి కొంచెముప్రసంగమును గావించినాఁడు. రాజుతో సమాన మైనదర్జాకలవాఁడుగాఁ గాని, లేక, యంతకుఁ బైదర్జాకలవాఁడుగాఁ గాని ప్రసంగించినాఁడే కాని కృష్ణ భారతములోవలెఁ గాని, ఉత్తరదేశభారతములోవలెఁ గాని, దీనాలాపములతోఁ బ్రసంగించియుండలేదు.

"ఆ. ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడఁ
గలరు తోఁచినట్లు పలుకు వలుక
నైనచంద మయ్యె నంతియకా కంత
పట్టి చూడఁగలరె యెట్టివారు."

అని మందహాసము సేయుచు మఱియును,

"కం. నానావిధభూతమయము
మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకుఁ జెల్లింపం
గా నగు సత్యంబు నడుపుక్రమ మట్లుండెన్."

'ఓరాజా! యథార్థస్థితినిఁ బలుకుమనుష్యు లెక్కడఁగలరు? తమకుఁ దోఁచినరీతినే పలుకుచుందురు. అంతేగాని యెట్టివారైనను సత్యమును బట్టిచూడఁగలరా? ఈప్రపంచము నానావిధభూతమయమై యున్నది. ఈశరీరము మిక్కిలి స్థిరముకానిది. అతిశయముతో నిక్కంబుగా సత్యమును నెఱవేర్చుట యెవ్వరికి సాధ్యంబగును? సత్యము నడుపురీతి యట్లుండనిమ్ము' అని చమత్కారపుఁబలుకులు పలుకుచుఁ దనయుదంతము నీక్రిందిరీతిఁ దెలుపుచు,

"కం. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ
సుజనప్రియుఁ డైనధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ ను
నిజవల్లభభాగ్యబహువినోదకరుండన్.

కం. ధ్యూతక్రీడకుఁ గొండొక
నేతుం గపటమున నొవ్వనిజనంబులు నా
చేతిధనమెల్లఁ గొని పరి
భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్.

చం. నృపనయవిద్యకుం దగిన నేర్పులనట్టిది కొంత కొంత ధ
ర్మపరులసంగతిం దగిలి మాన్చితి సంశయముం దొలంగ కంటిఁ దే
వపుఁగొలువైన నాకు నిలువన్ మదిఁ గోర్కెలు గాన నిన్ను భూ
మిపతులలోన సాధుజనమిత్రుఁడనా విని కొల్వవచ్చితిన్.

తే. వత్సరంబునఁ గడచును వ్రతము నాకు
దాని నీపాలఁ జల్పి యుత్సాహవృత్తి
మెఱయ నాకుఁ గృతఘ్నత నెఱపి కొల్చి
యొగ్గు చేసినవారి జయింపఁ బోను."

అని యడిగినవానికెల్లను నుచితరీతిని బ్రత్యుత్తరము లొసంగెను. ఇట్లు కంకభట్టు విరటునియుచితప్రశ్నలకుఁ దగువిధమున సమాధాన మిచ్చుచుఁ జేసినసంభాషణములను, వక్రసంభాషణము లనుచుఁ, దనకుఁ గలభాషాజ్ఞానమును శ్లేషలమూలముగను, ధ్వనులమూలముగను వెలిబుచ్చి తమనిజచారిత్రమును స్ఫురింపఁజేయుచుఁ గపటవేషానుకూలవాక్యములఁ బలుకుటలోఁ దనచాతుర్యమును జూపఁదొడంగె నని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు తమవిమర్శగ్రంథములో బహువిధములుగా నాక్షేపించుచున్నారు. కాని గురివిందపూస తనక్రిందినలుపెఱుంగ దన్నట్లుగా దమతప్పులను దా మెఱుంగకయున్నారు.

"ఉత్తరదేశపుఁబ్రతులలో నున్నవిప్రవేషమును మార్చి తిక్కనార్యుఁడు ధర్మజుని యతివేషమునకు దింపుటలో వైరస్య మున్నది కాని సారస్యము లే" దని వ్రాయుటకు విస్మయ మెందరు. ఉత్తరదేశపుఁ బ్రతులే కాని భారతమునకు దక్షిణదేశపుఁబ్రతులతోఁ బని లేకుండెనా ? ఏడువందలసంవత్సరములకుఁ బూర్వము దక్షిణదేశము

సం దున్న తిక్కనసోమయాజి యుత్తరదేశపుఁబ్రతులలో నున్నవిప్రవే షమును యతీంద్రవేషముగా మార్చినాఁ డని చెప్పుట కాధార మేమికలదో చూపినయెడల నెంతో సమంజసముగా నుండును. ఆనాఁడు తిక్కనసోమయాజి యీమార్పును జేయుటకు నుత్తరదేశములకుఁ బోయినవాఁ డందురా? ఈనిరర్థకపుదోషారోపణ మెందుకు? యతీంద్రుఁ డని దక్షిణదేశపుఁబ్రతులలో నుండఁగా, నేభట్ట బ్రాహ్మణపండితుఁడో యీయేఁబువందలసంవత్సరములలో నుత్తరదేశపుఁబ్రతులలో విప్రవేషముగా మార్చియుండు నని యనుకొనరాదా? ఎందు కీవట్టికంఠశోష? ఈచమత్కారఘట్టమును దిక్కన తన భారతమునఁ బ్రవేశపెట్టి తనయుత్కృష్టమైనకవితానైపుణ్యమును జూపుచుఁ, దనప్రతిభావిశేషమును గవిప్రపంచము నెల్లకడలను వ్యాపింపఁజేయుచు, మహోన్నతమైనస్థానమునఁ బీఠము వైచుకొని యం దధిష్ఠించియున్నవాఁడు. అట్టిమహోత్కృష్టస్థానమునుండి కవిబ్రహ్మాగారిని దించుట కీవిమర్శకునివంటివా రెంతకాలము తలక్రిందుగాఁ దపస్సు గావించినను నయ్యది సాధ్యపడునది కాదని పలియఁజెప్పుచున్నాను.

ఇంక ద్రౌపదీసంభాషణమునుగూర్చి యొకింత చర్చింతము. "ఈమె సుధేష్ణకడఁ గావించినసంభాషణము, ధర్మజునిసంభాషణము నకు సర్వవిధములఁ దోడ్పై యజ్ఞాతవాసము బయల్పడిపోవుటకుఁ గావలసినసందర్భముల నన్నిటిని జక్కఁగాఁ గూర్చినది. తిక్కనార్యుని మాలిని (ద్రౌపది) సుధేష్ణతోఁ దన కైదుగురుపతులు గల రని తెలిపినది. మననవవిమర్శకులు సూచించినరీతిగా నిదియొక్కటియే చాలును రహస్యమునంతయు బట్టబయలు చేయుటకు. మఱియు నామె యంతటితోఁ బోనీయక తన్ను శత్రువులు పతులముందట సభలోఁ గొప్పుపట్టుకొని యీడ్చి రనియు, నాయవమానము సహింపలేక

ప్రచ్ఛన్నవేషులై యున్నతనమగలును దానును నడవులలోఁ దిరిగి తిరిగి యిచ్చటికి వచ్చితి మనియుఁ, దన సైరంధ్రీవేష మొకవత్సర మువఱకు నవసర మనియు నుడివినది. పాండవులకడనుండి వచ్చితి నని చెప్పుకొనినకంకుఁడును దా నొకవత్సరము వ్రతము సలుపవలసి యున్న దని చెప్పినాఁడు. అక్కడనుండియే (పాండవులకడనుండియే) వచ్చినా నని చెప్పుకొనినమాలినియుఁను దన కొకవత్సరపువ్రత మున్న దనియే చెప్పుకొనినది కదా! ఇవన్నియును సమయభంగదములు కావా? తిక్కనార్యుఁడు తనకావ్యకళాచాతురిని సరిగ వినియోగించి యీవ్రాఁతను వ్రాసినట్లు తలంచుటకు వలను గాకున్నది.'' అని వ్రాయుట వట్టి యధికప్రసంగ మని చెప్పఁదగియున్నది. ఈయపూర్వ విమర్శకులు కావించునాక్షేపణములను జదువరులు పాటించుట సరి యగుపద్ధతిగా నంగీకరించు నెడల నిట్టియాక్షేపణములను వందలకొలఁది మూలభారతముపైనే చేయుట కవకాశము గలదు. వీరు చేసినయా క్షేపణములు తిక్కనభారతమున కెంతవఱకు వర్తించునో యంతవఱకు మూలభారతమునకును వర్తింపఁగలవు. ఇప్పుడు వీరు ద్రౌపదీసంభాష ణములనుగూర్చి యధిక్షేపించినయధిక్షేపణముల నంగీకరించు నెడలఁ దిక్కన, తనకావ్యకళాచాతురిని సరిగా వినియోగింపలే దనునది, మూలభారతగ్రంథకర్తలైనవ్యాసాదులకును వర్తించును. ఇక్కడఁ బ్రత్యేకముగా నొక్కతిక్కనసోమయాజినే వెక్కిరింప నవసరము లేదనియు, నట్లు మూలగ్రంథమును ముట్టనైనముట్టక, యొక్కతిక్కన సోమయాజినిమాత్రమే యెత్తికొనుటవలన వీరిప్రసంగ మధికప్రసంగ మని చెప్పవలసివచ్చుచున్నది. సుధేష్ణతో ద్రౌపది జరిపినసంభాష ణము నెత్తికొని యధిక్షేపించుటచేత నిందునుగూర్చి నాయభిప్రాయ ములను, యుక్తియుక్తము లగు నాసమాధానములను ముందుగా నొసంగుచున్నాను.

మొట్టమొదట, సమయభంగము కలుగకుండుటకై పాండవు
లకు ధర్మదేవతావరప్రసాదము గలదు. దీనిని ఏన మెన్నఁడును
మఱవరాదు. పాండవులధర్మపత్ని యగుద్రౌపది కాలకర్మవశమునఁ
బరదేశమునఁ దమ్మేలుఁగని యొక్క రాజకుటుంబమునఁ దనభర్తల
వలెనే తానును సేవకావృత్తి నుండవలసివచ్చెను. అయ్యది యొకసం
వత్సరకాలముమాత్రమె. ఈసంవత్సరకాలము తా మెఱుకపడకుండఁ
దమతమవృత్తులను నిర్వర్తించుకొనుచు నొకరాజకుటుంబమును సేవిం
పుచుఁ గడుపవలయు ననుట సత్యము. ఇందుకై వీరలు మత్స్యదేశ
మును, తద్దేశాధిపతి యగు విరటునికొల్వుకూటమును నిర్ధారించు
కొనిరి. ఇట్లు పాండవులు తా మేర్పాటుచేసికొన్న వేషములను ధరించి
మత్స్యదేశమునకు రాజధాని యగువిరాటనగరంబును బ్రవేశించి
క్రమముగాఁ బాండవులేవురును విరాటునికడఁ గొల్వున కమరిరి.
ద్రౌపది, విరటునిభార్య యగుసుధేష్ణాదేవికొల్వునఁ జేరినది. మొదటి
నుండియుఁ బాండవులకు మత్స్యదేశము సుభిక్షమైనదేశ మనియుఁ,
దదధిపతి యగువిరాటుఁడు సాధుజనమిత్రుఁ డనియు, నచట నితరుల
కెవ్వరికి నెఱుకపడకుండ నొకసంవత్సరము తమయజ్ఞాతవాసకాలము
సురక్షితముగాఁ గడుపఁదగు నన్నవిశ్వాసము గలిగియుండుటచేతనే
వీరెల్లరు నచటికిఁ జేరిరి. ధర్మరాజు యతీంద్రునివేషముతోఁ బ్రవేశ
కాలమున విరటునితోమాత్రము ప్రసంగించినాఁడు. ద్రౌపది సైరం
ధ్రీవేషముతో రాణిసుధేష్ణాదేవినివాసమునకుఁ బోయి యచట
నామెతోనే ప్రసంగించినది. యతీంద్రుఁ డగుకంకభట్టుప్రసంగములను
గూర్చి యింతకుఁబూర్వము వ్రాసియుంటిని. ఇప్పుడు ద్రౌపదీసంభాష
ణమునుగూర్చి యొకింత తెలియఁజెప్పవలసి యున్నది. పాండవులేవుర
చరిత్రమును విరాటరాజునకే తెలియకుండె నని చెప్పినప్పు డంతఃపు
రము నివాసముగాఁ గలయాతనిపట్టపురాణి సుధేష్ణాదేవికి సుతరాము

తెలియ దనుట సత్యమున కంతదూరము కాదు. ద్రౌపది స్త్రీ యగు టచేతను, బరరాజ్యమునందుఁ ద న్నెఱుంగనిపరరాజకుటుంబమున నంతఃపురమున నివసింపుచు రాణికి నొకపరిచారికగా సేవ చేయుటకు నొప్పుకొని దాసదాసీజనంబులనడుమ సంచరింపవలసిన దగుటచేతను, దా నొకమహారాజునకుఁ బుత్రికయై పాండవులేవురకు ధర్మపత్నియై సౌందర్యము గలస్త్రీయైయుండుటచేత, నాత్మరక్షణోపాయమునం దేమఱియుండరా దని, తాను సుధేష్ణకడఁ గొల్వు కుదుర్చుకొనుకాలముననే, తన్నుఁగూర్చియుఁ దనవృత్తినిగూర్చియు నామెకుఁ గరుణ పుట్టునట్లుగామాత్రమె కాక యొకవిధమైన గౌరవమును, భయమును గూడఁ గలుగునట్లు సంభాషించినది. విరటునిభార్య యగుసుధేష్ణ ద్రౌపదివంటి తెలివిగలది కాదనుట నిశ్చయమె. మొట్టమొదట, సుధేష్ణపనికత్తె లిరువురు రాణియాజ్ఞను శిరసావహించి రాజవీధిని నడచివచ్చుచున్నద్రౌపది కాసమాచారమును దెలిపి యామెను వెంట నిడుకొని సుధేష్ణకడకుఁ గొనిపోయినప్పుడు, ద్రౌపది సుధేష్ణయెదుట నిలువంబడినవిధమును గవిబ్రహ్మ యిట్లు వర్ణించినాఁడు.

"చ. కనుఁగొని గారవంబున మొగంబునఁ గేలఁ బురఃప్రసారముం
దనువున నమ్రభావమును దంతమరీచుల సామినిర్గమం
బును దనలోఁ గడంగొనఁగ భూరితసాదరరేఖ నిందు ర
మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్."

ఆపాదమస్తకము ద్రౌపదియాకారమును వీక్షింపుచు విరటునిమహిషి యగుసుధేష్ణ సంతోష మెఱుకపఱుచుచు నుచితమార్గమున నామె నిట్లు ప్రశ్నించినది.

"ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరి
దాన వేమిపనికిఁ బూని యిప్పు
డెటకుఁ బుద్ధిఁ దలఁచి యేగెద వింతయుఁ
దెలియఁ జెప్పు మాకు మెఱుఁగఁబోఁడి."

అప్పుడు ద్రౌపది యిట్లు పలికినది,

"నేను సైరంధ్రీజాతిసంభూతను; నా పేరు మాలిని యందురు. నా కేవురుభర్తలు గలరు. ఒకప్పు డొక్కకారణంబున నుద్ధతు లగు విరోధులచేత భర్తలయెదుటఁ దల వట్టి యీడ్వఁబడి వనంబున కరిగి వ్రతమును బూని వల్లభసహితముగా వన్యాహారంబులఁ గాలముఁ గడుపుచు బ్రహ్మచర్యంబు నడపితి. ఇటమీఁద నియమాచరణంబు నకు నొక్కసంవత్సరంబు గొఱంత కలదు. నీవు ధర్మవర్తిని వని వినుటంజేసి నానేర్పుపనులవెంట నీకడ నిలువందలంచి యిందు వచ్చితిని."

అంత సుధేష్ణ ద్రౌపదిని జూచి మరల నిట్లు ప్రశ్నించినది. "అరయఁగా నీవు సురగరుడఖచరవిద్యాధరకిన్నరయక్షసిద్ధతరుణు లలో నొక్కతవు. ఎందు కీపురమునకు వచ్చితివో బొంకక చెప్పుము."

అనవుడు ద్రౌపది "నేను పూర్వము కృష్ణునిభార్య యగు సత్యభామకును, నటుపిమ్మటఁ బాంచాలికిని బని సేసితిని; మఱియు ధర్మమునకుఁ గట్టువడి పరిచారికాధర్మములను నెల్లఁ జాలి ప్రవర్తించితిని; ఓతల్లీ! వినుము. ఆమె నాప్రాణము దనప్రాణముగా భావించుకొని గారవించునది. నీవును నీచము లైనపనులకు నేను చాలనని యెంచి మన్నన కర్హమైనదానినిగా భావించి యాచారము దప్పని విధముగా నాసేవను గైకొనుము.

కం. కలపములు గూర్ప బహువిధ
తిలకంబులు వెట్ట వింత తెరవునఁ బలుపు
వ్వులు గట్టి కట్టి ముద్దుగఁ
దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్."

అని వినయనయసంభాషణంబులు సలుపుచుఁ దనయభిమతమును విస్పష్టపఱిచినది. అప్పు డామె యాశ్చర్యమును బొంది, "నీవు రూప

సివి; మా రాజు నీరూపమును జూచి యువ్విళ్లూరుచుండును; నీవలన నే నెట్లు పనులు గైకొందును? ఇంతులును విస్మయ మందుచు, వారి దృష్టులను నీపైఁ బఱపుచు నిన్నుఁ జూచుచుందురు. 'భరింప శక్యము కాని నిన్నుఁ గైకొని గర్కటి గర్భముదాల్చినట్లు నావినాశమును నేనే తెచ్చుకొనుట వెరవగునా?'' అని తనలోనిభయమును వెల్ల డించెను. అట్లు కాదు విను మని సైరంధ్రి యిట్లు ప్రత్యుత్తర మిచ్చినది.

''వెరవును లావును గల మహాపరాక్రమవంతు లైననాపతులు గంధర్వు లేమఱియుండక సదా నన్ను సంరక్షింపుచుందురు. ఎవ్వఁడు నన్ను నీచబుద్ధితోఁ జూచునో యాచపలుని నారాత్రియే, బలవిక్ర మము లఖర్వము లైనను, హరిహరాదు లడ్డుకొనినను దెగఁజూతురు; మత్తేభములవలె శౌర్యమదాంధు లైనబంధుశతంబులు సంరక్షించు చున్నను వానిని సంధులసంధు లెడలించి చంపుదురు గాని యుపేక్షిం పరు. అందుచేఁ బురుషులు నన్నుఁ దేఱిచూడ వెఱతురు. అదియునుం గాక నాచిత్తము వారి కగోచర మైనదిగా నుండును. అస్మదీయకుల జననశిక్షాచారమహిమ యట్టిది. కావున నట్టిహీనవచనంబు లాడ కుము. మనంబును శాంతిపఱుచుకొమ్ము. అనుమానము విడువుము. నీకువచ్చినభయము లేదు. నన్నుఁ బరిపాలింపుము. ఎట్టిపనుల నైనను నుదాత్తనాగరకరీతుల నీమది కెక్కునట్టులు నేర్పుతోడను, భయ భక్తులతోడను జేయుచుఁ దద్జ్ఞులయిన సజ్జనులు, సాధులు, వృద్ధులు మొదలగువారు మెచ్చునట్లుగాఁ బ్రవర్తింతును. నన్నుఁ గుచ్చితంపుఁ బనులకుఁ బంపక యెంగిలికూడును బెట్టక మన్ననతోఁ జూచువారి మొదల ననురాగమును నెఱపుచు నాపతులు నడచువారుగా నెఱుంగుము.''

ఇట్టిపలుకులు సైరంధ్రివలన వినినదయ్యెను, సుధేష్ణాదేవి యుత్తమపట్టమహిషి గావునc దనసంతోషమును దేటపఱుచుచు నామెను దనకొల్వున నుంచుకొనియెను.

ఇంతియకాని చమత్కారముకొఱ కామె యేమనునో తెలిసికొనవలయు నని యుత్తమరాజపత్ని యగుసుధేష్ణాదేవి "విను నీరూపముc జూచి మాన్నృపతి యువ్విళ్లూరు నే నెమ్మయిం బనిగొందు" నని ప్రౌఢముగాc బలికినట్లు తిక్కన యామెచేc బలికించెనేకాని యీ యపూర్వవిమర్శకాగ్రేసరులు వ్రాసియున్నట్లుగా "నిన్ను నాకడc జేర్చుకొనిన వదలుకచ్చగల నాపతి నిన్ను మఱcగి నన్నుc ద్రోసిరాజనునేమో కాన నిన్నుc జేర్చుకొనుటకు జంకుచున్నా"నని యప్రౌఢముగాc బేలవంపుమాటలు పల్కినట్లు వ్రాసియుండలేదే? ఇయ్యది యీయపూర్వవిమర్శకాగ్రేసరుని యధికప్రసంగ మని యనుపించుకొనదా?

---

# ఐదవ ప్రకరణము

## తిక్కన కావ్యకళాదృష్టి.

కావ్యగుణములకుc బెన్నిధి యగునది మూలభారతము. అందలి సారస్యమును బోcగొట్టక యున్నదున్న ట్లనువదించుటకు మహాప్రతిభ కావలయు నందురు. అట్లగునెడ నౌచిత్యరసపోషణార్థము స్వతంత్రించి మూలగ్రంథకారునిరచనములను మార్చు టెంతటిమహాత్కార్య మనcదగునో వేఱుగc జెప్పవలయునా? తిక్కనసోమయాజి తనభారతమున, నందు ముఖ్యముగా విరాటపర్వమునందు మార్పులను

బెక్కిుంటేని జొప్పించియున్నాఁ డని మూలానువాదముల సరిపోల్చు కొనుపాఠకవిమర్శకులకు విదితము కాఁగలదు. "తనకావించినసృష్టి తక్కొరులచేతం గా" దన్నప్రబంధపరమేశ్వరునిపొగడ్తకు హేతువు లగు నీకవిబ్రహ్మగారిరసికతకును, గవితాశిల్పచాతుర్యసౌందర్యము నకును, నౌచిత్యరసపోషణమునకును మిన్న యగుతార్కాణ మీవ్య త్యయమే కాని మఱియొండు గాదు. అట్టి వీవిరాటపర్వమున వందల కొలఁదిఁ గన్పట్టుచున్నను గ్రంథవిస్తరభీతిచేఁ గొలఁదిగమాత్ర మిచ్చటఁ జూపుటకు సాహసించుచున్నాను. మూలములో:-(౧) అర్ధ రాత్రమున వంటయింటిలో వలలుఁ డని మాఱుపేరు పెట్టుకొని వంటల వాఁడై యున్నభీముఁడు మైమఱచి నిదురించుచుండఁగా సైరంధ్రి (ద్రౌపది) విరటునిమఱఁది యగుకీచకునితాపుచేఁ బరిభవింపఁబడి భీమునితోఁ దనభంగపాటునుగూర్చి తలపోసికొన వచ్చినఘట్టమున:—

"అరణ్యములోఁ బెఱుఁగుచుండిన మూఁడేండ్లవయస్సు గల యొకయావు మొదటిసారి యెదగొని పొగరుతో నున్నకోడెను గదిసి నట్లును, నీలిచాయ నున్న యొకకొంగ పెంటికలయికఁ గోరి పోతు కొంగను జేరినట్లును సైరంధ్రి (ద్రౌపది) భీముని దరిసినది. గోమతీ తీరమునందలి మహాసాలమును దీఁగవలె భీమునిఁ బొదివికొనెను. అట్లతనినిజబాహుద్వయముచేఁ బొదివికొని సులక్షణవతి యగునామె దారి తెన్ను గానరానియడవినిబడి నిదురించుసింహమును సింహీవలె మేల్కొల్పెను. హస్తిని హస్తినట్లు శీలవతి యగుపాంచాలి భీమునిఁ గౌఁగిలించి, వీణనుండి వెడలుగాంధారస్వరమువంటిమధురస్వనమున భీము నిట్లు సంబోధించెను:—

"ఉత్తిష్ఠోత్తిష్ఠ, కిం శేషే, భీమసేన, యథామృతః,
నామృతస్యకః పాపీయాన్ భార్యా మాలభ్యజీవతి."

[చచ్చినట్లు పరుంటివేః భీమసేనా! లెమ్ము, లెమ్ము; బ్రదికినవానికి భార్య నగుదు నేని యాపాపి చావకుండునా?]

అని మూలగ్రంథకారుఁడు సైరంధ్రినోరనుండి పలికించినాఁడు. అదనున కనువుగా నడువనేర్చినద్రౌపది, కొండవంటి యోరిమిగల ద్రౌపది, ఏవురుమగలవలపు సరిగా గడించినద్రౌపది, మగలవెంటఁ బడి యడవుల సిలుగులఁ బడనోపినద్రౌపది, ధర్మరాజాది మగల యేవు రకు రాచఱికపునడకలనుగూర్చి యెచ్చరింపఁగల వలంతి యగుద్రౌపది, యుత్తమది కెక్కినవడవడు లలవడఁజేసికొన్నకోడ లగుద్రౌపది, కీచ కుఁడు తన్నుఁ బఱచిన యాఱడి నెఱిఁగించి వాని నెసకొల్పి కసిఁ దీర్చి కొన నద్దమరేయి వలలునివంటయింటి కరుదెంచినద్రౌపది వానిపైఁ బడి "భీమసేనా! చచ్చినట్లు పరుండితివా? లెమ్ము; లెమ్ము;" అని పలుకుట యౌచిత్య మనిపించుకొనునా? ఆమెనడతకు సరిపడునా? ఆవు, కొంగ, మెకము, ఏనిక, తీవ యుపమానములు వట్టిఛాంద సమును దెలుపువర్ణనములే కాని సమయయోగ్యములు, సరసములు నగువర్ణనము లనిపించుకొనునా? ఇంతతో సరిపుచ్చఁబడినదా? అటుపై జరిగినచిత్రప్రశంసను గనుఁగొనుఁడు.

అప్పుడు భీముఁ డిట్లు ప్రశ్నించినాఁడు :

"ఏమిపనిఁబూని యింతత్వరితముగా నిచ్చటికి వచ్చితివి?" సైరంధ్రి కీచకునిచేఁ బరిభవింపఁబడినవిధము నెఱింగియుండియు నిట్లనా లోచితముగాఁ బ్రశ్నించుటకు నిదురమబ్బున బుద్ధిబలము కొఱవడి యుండుటయె కారణ మైయుండు నని మన మూహింపవచ్చును గాని తరువాతిప్రశ్నమును జూడుఁడు :

"ఏమిది; నీవన్నె మాసినది; వెల్లనై యగుపడుచున్నావు; నా కంతయు విస్పష్టముగా నెఱిఁగింపుము; అది ప్రియమో, అప్రియమో, సంతోషప్రద మయినదో, సంతాపకారణ మైనదో నాకుఁ దెలియఁ జెప్పుము; అంతయు విన్నమీఁదటఁ దగినవెర వాలోచించి కర్తవ్య మును నెఱవేర్తును."

ఇట్లు భీమునిచేతఁ బలికించుటయం దెట్టియౌచిత్యము గలదో యొకింత విచారింపవలయును గదా! ఒరు లెఱుంగకుండ మెలఁగవలసినవా రీదంపతులు. భీముఁడు పరుండినచోట దీప ముండెనో లేదో చెప్పకపోయినను దీప ముండె ననియే భావింతము. ఆదీపము నార్పివేసియో, దూరముగా నుంచియో చీఁకటింట గుజగుజలు వోయియుందురు గాని తమరహస్యము బయల్పడు నన్నభీతిగలవారు దీపము వెలుఁగున సుద్దులు సాగింతురా? ఇదేటియౌచితి? ఆనాఁటిసభలోఁ గీచకునిచేఁ బాంచాలి తాపుతిన్నప్పు డామెను భీముఁడు చూచియుండెను గదా! అప్పటికి లేనివన్నెమాపు, వెల్లబాఁటుఁదనము గ్రొత్తఁగా నామెయందు భీముఁ డెట్లుచూడఁగల్గెను? ఆతాపునకు నీతలపోతకు నడుమ నెంతతడవు గడచినది?

ఇట్లు మూలమునం దెంతయో యనౌచిత్యదోషము గన్పట్టుచున్నది. ఈయనౌచిత్యదోషమును గనిపట్టియె యెట్టిదోషమునకుఁ దాను పాల్పడక తిక్కన తనయౌచితి నెట్లుకాపాడుకొనఁగల్గెనో యొకింత పరిశీలింతముగాక!

తిక్కన తానుచెప్పఁదగినదానినంతయుఁ జెప్పకమానఁడు. మానఁదగినదానిఁ జెప్పఁడు. అనవసరమైనసోదెకు దిగి యక్కఱకుమాలినప్రసంగములకుఁ దావియ్యఁడు. ఆవు యొదగొని కోఁడెను గదిసెనని, యాఁడుకోంగ మగకోంగకై వలపులాడె నని, యక్కఱకుమాలిన ప్రసంగమును జొప్పింపక పాత్రమర్యాదకును, బట్టునందలిభావమునకును నొప్పిద మగురీతిని సూటిగా నాట్యకళాకౌశలము నిరూపించుచున్నాఁడు, చూడుఁడు.

"వ॥......రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున నిద్రింపం దొడంగినం దాను శయ్యాతలంబు విడిచి మేనిధూళి గడిగి ధౌతపరిధానపరీతయై మహానసగృహంబున సుప్తుం డైనవృకోదరుకడకుం జని,

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగుఁ దప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్నుమొగుడ్చుటెట్టులుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వల దన్న నొకో దయమాలి తక్కటా!

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలిపాణిస్పర్శనంబున మేల్కాని యుదిరియెవ్వ రనవుడు నే ననునమ్మానినియెలుంగెఱింగి భీమసేనుండు యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిగ్రింప నియోగించునది యై యరుగుదెంచెం గావలయు నత్తెఱం గిత్తెఱవ చాన చెప్ప వింద నని తలంచి.

తే. ఇంతప్రొద్దేల యిచ్చోటి కేగుదెరఁ
గారణం బేమి యెవ్వరుఁ గానకుండు
నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి
యనిన నయ్యింతి యి ట్లను నతనితోడ.

చ. ఎఱిఁగి యెఱింగి న న్నడుగ నేమిటి కప్పు డెఱింగి యింతకు
న్మఱచుట గల్గెనే నది వినం బనిలే దటుగాక యున్నరూ
పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స య
త్తెఱఁ గెఱిఁగించెద న్వినుము తెల్లముగా మొదలింటినుండియున్.

అని పలికించి తరువాతికథ చెప్పించినాఁడు. ద్రౌపది పాండవాగ్రజుఁడగుయుధిష్ఠిరుని తొల్లింటివైభవమును, నిప్పటిపేదఱికమును దలపోసికొని పోల్చి పొక్కుచు భీమసేనునితోఁ జెప్పకొనుచు వాపోయినసందర్భమునఁగూడ మూలగ్రంథకారునికవితాకళ మూతిముడిచిపోయినది. మూలములో:—

"దశనాగసహస్రాణి హయానామ్ హేమమాలినామ్
యం యాన్తమనుయాన్తీహ సోఽయం ద్యూతేన జీవతి!
రథాశ్శతసహస్రాణి నృపాణా మమితౌజసామ్
ఉపాసన్త మహారాజ మింద్రప్రస్థే యుధిష్ఠిరమ్
శతం దాసీసహస్రాణాం యస్య నిత్యం మహానసే
పాత్రీహస్తం దివారాత్ర మతిథీన్ భోజయన్త్యుత."

పదివేలయేనుంగులును, పదివేలగుఱ్ఱములును బంగారుచౌడోళ్లతోఁ దనవెంట నడచి రాఁగా నూరేగెడిధర్మరాజు నేఁడు జూదముతో బ్రదుకుచున్నాఁడే? నూఱువేల రథము లలమి తేజస్సంపన్నుని మహారాజును యుధిష్ఠిరుని నింద్రప్రస్థమునఁ గొలుచుచుండెడివే! నూఱువేలమందిదాసీ లెల్లపుడును రేయింబవళ్లు తన (ధర్మసుతుని) వంటయింట వడ్డనపాత్రలు చేపట్టి యతిథులకు భోజనములు పెట్టుచుండెడివారే!

మూలమునకు విధేయముగా నుండవలె ననికాఁబోలు శ్రీకృష్ణ భారతమున నిట్లు వర్ణింపఁబడినది.

"ఉ. తిట్టుము పాడుజూద మది తెచ్చి శిరంబునఁ బెట్టి చెట్టలం
బెట్టినవాని నందఱకుఁ బెద్దగువాని దురోదరప్రియున్
గట్ట! వచింపనే మతఁడు గాక మఱొక్కఁడు రాజ్య మొడ్డి తా
నట్టడవిం జరింపఁగ మనం బొనరించునె మానభూషణా.

తే. ధనకనకవస్తువాహనతతుల నరసి
యొడ్డి రేఁబవల్ విడ కాడుచున్నయేని
జూద మది యేండ్లుఁబూండ్లుగాఁ జూడనైనఁ
దెగకయుండు నిట్లొనరింపఁ దగులఁ డతఁడు.

కం. తనచేసినపనికిన్ యమ
తనయుఁడు నెమ్మనమునందుఁ దలఁగని చింతన్
గొని మూఢునట్లు మిన్నక
కనుఁగొనుచున్నాఁడు నేఁడు కడుదీనుండై.

సీ. పదివేలహయములు పదివేలహస్తులు
పదిపదివేల్ రథపంక్తు లెపుడుఁ
దోడ రాఁ బురవీథి వేడుకమై నేగు
పెండ్లి యొనర్చెడుపృథ్వీనాథుఁ
డనిశంబు నిష్కసహస్రవేతన మిచ్చి
దాసీశతసహస్రతతుల నిల్పి
తనయింటఁ బవలురే యనక పారలచేన
తిథుల సాపడఁ జేయుప్రథితకీర్తి
యొరు లెఱుఁగకుండ నొక్కచో నుబుసుపుచ్చు
నట్టి దైయుండి నీచయాచ్ఞాప్రభుక్తి

నుదరమున నుంచుకొంచుఁ దా నున్నవాఁడు
ధర్మసుతుఁ డక్కటక్కటా దైవఘటన.''

మూలగ్రంథమునఁ గానరానికవితాకళాప్రతిభ మూలమునకు విధేయ మైనయనువాదమునం దెట్లగపడఁగలదు. వట్టిజాబితామాత్రము తయా రయినది. ఇంక నీఘట్టమునఁ దిక్కనకూర్పుఁ గనుఁడు.

తిక్కనరచనము:—తనపరిభవమును దెలుపుచు ద్రౌపది భీమునితోఁ బలుకుచున్నది.

తే. పాఱుదెంచిన నక్కులపాంసనుండు
కోప మడరంగ వెనుకనకూడ ముట్టె
నఁట యెఱుంగుదు నీవు మీయన్న పెద్ద
తనముఁ జూచితి వేమందు ననిలతనయ.

ఆ. అకట యాఁడుకూయు నాలకూయును లాఁతి
వారికైన నరయవలయు ననిన
నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు
నూడ నేర్చె ధర్మసూనుఁ డపుడు.

తనపరిభవము ధర్మజుఁ డెట్లుచూడఁగల్గె నని భీముని ద్రౌపది ప్రశ్నించినట్లుగా రచించినాఁడేకాని మూలమునందును గృష్ణభారతమునం దును ద్రౌపది పేలవపుమాటలతో ననౌచిత్యపుధోరణి దూషించినట్లుగా వర్ణింపలేదు. అప్పుడు భీముఁడు ద్రౌపది కిచ్చినప్రత్యుత్తరముగూడ నెంతవివేకముతో నౌచితికి భంగము లేకుండ, సమంజసముగా నొప్పియున్నదో చూడుఁడు.

"ఉ. కీచకుఁ డట్లు మీఁదు పరికింపక తన్నుఁ బరాభవింపఁగాఁ
జూచి మహోగ్రకోపవివశుం డగునన్నను జూచి ధైర్యహా
మాచలుఁ డైనధర్మసుతుఁ డమ్మెయి వారణ సేయకున్న నే
నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గుసేసినన్.

క. ఆసంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల నెఱింగిరయేని,

కం. ముందటిభంగిన కౌనల
యందుఁ జరిచపంగవలచె యడి నీవును నే
నుం దెచ్చినయాపదగా
నిందింపరె యెల్లవారు నీరజనయనా?

వ. కావున సత్యవ్రతనిష్ఠుం డగుయుధిష్ఠిరుండు పాగడ్తకుం దగువాఁడు గాని దూఱువడ వలఁడు గాఁ డని వెండియు నిట్లనియె.

కం. పరిభవకరుఁ డగుకీచకుఁ
బరిమార్చుట యిపుడు గడవఁబడియె నె యిమ్మై
దురపిల్ల నేల వ్రేల్మిడిఁ
బొరిగొని నీమనము కలకపుత్తు లతాంగీ.

వ. మనల నెవ్వరు నెఱుంగకుండునట్టి తెఱంగుఁ దలపోయవలయుఁ గాక పగతుని భంజించు టెంతటిపని యనిన విని యమ్మానిని యిట్లనియె.

చం. కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి నాపడుపాటు లెల్ల వ
మ్మును గలియంగ నిట్టు లొకమూర్ఖునిచేఁ జుదిఁ బోయి కోలుపో
యెనె యభిమానము న్వగపు నేత్రిఱ డెందము గొందలంబుఁ బొం
దిన ధృతిమాలి యేఁ బలికితిం దగ వెల్ల నెఱింగియుండియున్."

వ. ఇట్టిదిగాని సమస్తజనస్తవనీయుం డగుపాండవాగ్రజు నిక్కంబ నిందించినదానం గా నని పలికి మఱియును."

పైరీతి ద్రౌపది భీమునికి సమయోచితముగాఁ బ్రత్యుత్తరముఁ బలుకుచు ధర్మజు నిట్లభినందించుచున్నది.

క. ధర్మతనూభవు సంతత
ధర్మనిరతి మనము బ్రదుకఁదలఁచుట యరుదే
నిర్మలుఁ డగు నాతనిస
త్కర్మంబునఁ గాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్.

సీ. చనునె వేఱొకని కజాతశత్రుం డను
పేర దిగ్విజయంబు పెంపుదాల్ప
రాజసూయమహాధ్వరముఁ గోరి చేయంగఁ
దీఱునే పెఱధరిత్రీపతులకు

ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె
యనఁ జన నోరులకు నలవియగునె
నిత్యవ్రతంబుగా సత్యంబు పాటింప
వచ్చునె యొరుల కెవ్వరికినైన

తే. నయ్యుధిష్ఠిరుగాంభీర్య మతనిధైర్య
మరయ నొండెడఁ గలుగునె యతఁడు కీర్తి
ధరుఁడు గరుణోత్తరుఁడు మహీసురసమృద్ధి
కరుఁడు నిజవంశకరుఁ డుపకారపరుఁడు.

క. కలిమికి నొప్పగునీగియు
బలిమికిఁ దొడవైనయట్టిబలగము నై లో
కులచిత్తములకు బ్రేఁగగు
కొలఁది మనం గొంతిపెద్దకొడుకున కమరున్.

సీ. ఎవ్వానివాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపుగఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి
మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల
కడపటికొండపైఁ గలయఁబ్రాఁకు

తే. నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణిచేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు."

ఈపై రీతిగాఁ దిక్కన తన చక్కనిచిత్తారిపనితనముఁ జూపినాఁడు. ఇట్టి వెన్నో యీవిరాటపర్వఘట్టమున మనము చూడఁగలము. వాచ్యములుగ నున్నవానికి వ్యంగ్యరూపము లిచ్చి కవిత్వ మనిపించు చున్నాఁడు. స్థాయి నెఱిఁగి భావ మన్వయించుకొని యాలపించి

జీవము పోయుచున్నాఁడు. వట్టిమాటలజాబితా కొకరూపము నిచ్చి వన్నెఁబెట్టినాఁడు.

(౨) మూలమున విరాటుఁడు బృహన్నలను (అర్జునుని) తన కొమార్తెకు నట్టువొజ్జగ నియమించుటకుఁబూర్వము ముందుగా నతని గీతాదికుశలతం బరీక్షించుటయుగాక నిజమంత్రులతో నాలోచించి (పరీక్ష్యచైనం ప్రమదాభిరాశువై; అపుంస్త్వ ముప్యస్య నిశమ్యచ స్థిరం) మించుబోఁడులం బుచ్చి పరీక్షించి పేడి యని నిశ్చయించి యతనినపుంసకత్వమును దృఢముగా నెఱింగె నని యున్నది. కాని తిక్కన యాంధ్రమునఁ బరీక్షాప్రస్తావమే వాచ్యముగాక "నైపుణంబున నుచితంబుమై మై నరసి పొచ్చెములేమి" నని మాత్రము తెలుపఁబడినది. ఇచ్చటఁ గవిబ్రహ్మ మూలమునందలియశ్లీలతను "నైపుణంబున నుచితంబుమై" దూరీకరించుట విస్పష్ట మగుచున్నది.

(3) సుధేష్ణయానతిం గొని సైరంధ్రి కీచకునింటికిఁ గల్లుగొనిపో వచ్చినపుడు కీచకుఁడు (మూలములో):—

'తాం మృగీమివసంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం' సమీపమునకు వచ్చుచుండెడి భీతహరిణిం బోలుద్రౌపదిని ("చకితకురంగివోలె" యని కృష్ణభారతము) వీక్షించె నని మూలము. ఇందుకు "బెబ్బులి యున్నపొదను లేడి సొచ్చుచందంబున" సైరంధ్రి కీచకుని మందిరంబుఁ బ్రవేశించె నని తిక్కనగారికూర్పు. ఇది మూలరూపమునకు జీవము పోయునట్టిది.

(౪) మహావీరుఁ డైనభీమసేనుఁ డాఁడుదాని వేసముఁ దాల్చుటకును, గామప్రేరితకీచకప్రలాపములకు వలపుకత్తెవలెనె ప్రతిభాషణంబు లాడుటకును [illegible] ? ఒక వేళ సమయ[illegible] [illegible] భయముచేత రహస్యగోపనార్థ మాతఁ డట్లాచరించి

యుండు నని సమాధానము చెప్పుకొందమందురేని నర్తనశాల యంధకారబంధురము గదా! అచ్చోట స్వస్వరూపముతో నున్నను నేమి విపత్తు సంభవించును? మోసమున మాఱువేసమునఁ గాక సింహబలుఁడైనకీచకుని సంహరింపఁగలనా యని భీముఁడు సంశయించెనా?'' అనుప్రశ్నములకు సమాధానము మూలమున నెంతమాత్రముఁ గానరాదు. కాని తిక్కన యాంధ్రమున నేతన్నిమిత్తమే యద్భుతమైన సంవిధానము గల్పింపఁబడిన దని విమర్శకులు కనుపెట్టఁగలరు. భీముఁడు ద్రౌపదితోఁ బ్రతిజ్ఞ చేయునపుడు ''ఆసాబగునిం దెగఁజూచి, నీకుం జూపి నీచిత్తంబు వడసెద'' నని చెప్పెను. అందునిమిత్తమే యాతఁడు నర్తనాగారమున ''విరాటనందన యగునుత్తరపర్యంకమున కనతిదూరమున సైరంధ్రి నోసరిల నుంచును. కనుకనే కీచకునికామోద్రేకసంభాషణములకుఁ ''గనలియు, రోసియు, మృదురీతి నుచిత నిగూఢభంగు లగుభాషణములను దనప్రియకు వినుపించుటకుఁ''గా బదులుపల్కెను. ఇందుఁ బ్రకటమగుచున్న తిక్కనార్యుని ప్రకరణోచితకల్పనాసామర్థ్యము నెంతేనిఁ గొనియాడందగును.

(౬) కీచకునితో భీముఁడు పోరాడుటకుమున్ను తనవాస్తవస్వరూప మాతనికిఁ దెలియఁజేయుచు నీక్రిందిరీతిఁ బలికినట్లుగా మూలమునం దున్నది.

''పాపాత్మా! సింహముచే మత్తగజేంద్రముకైవడి, నాచేఁ బడమిని ద్రోయఁబడి యీడ్వంబడుకొందను బోలునిన్ను నీయక్క చూడఁగలదు. నీవు చచ్చినయెడ సైరంధ్రి నిర్భయముగ విహరించును. ఆమెభర్తలును సుఖంపడుదురు.''

ఇట్టిపలుకులు భీమునిచేఁ బలికించుట కీచకుఁ డెదుర్కొనుటకును, సేవకాదులనుగూర్చి యెలుఁగెత్తి కూయుచుండుటకును నవకాశము

నిచ్చుటయగాక యేమఱుపాటునఁ గీచకుని బట్టికొని యుక్కడఁగింపఁ గోరు భీమునుద్దేశమునకు విరుద్ధమునై యున్నది. కనుకనే తిక్కన మూలములోని పైభీమవాక్యములను బూర్తిగా వదలి యతఁడు "గ్రక్కున లేచి" యతనిం "దలపట్టి వంచి" నట్లు వర్ణించినాఁడు.

(౬) భూమ్యాకాశములు భేదిల్లునట్లు సింహనాదములు సేయుచు భీమకీచకులు పోరాడినట్లు మూలమున నున్నది. ఇందలి ప్రకరణవిరోధమును బాగుగా గుర్తించి తిక్కన వారియుద్ధమును వర్ణించుసందర్భమున:—

"క. తనయగపా టొరు లెఱుఁగుదు
రని సూతుఁడు, సమయభంగ మగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గాఢవిమర్దనప్రహారములు దగన్."

గడంగి రని రచించినాఁడు. ఇరువురు నిశ్శబ్దముగఁ బోరి రనుటయ గాక, కీచకుఁడు నట్లుచేయుట కద్భుతహేతువుం గుదుర్చుట యుత్తమ విశేషము గదా!

(౭) మూలములో వృక్షము నొకదానిఁ జేతం బట్టుకొని యేతెంచుభీమునిం గని యుపకీచకులు బెదరి యూరివైపు బఱవిడుటకుఁ బూర్వము ద్రౌపదిని కట్లనుండి విడిపించి రని యున్నది. ఆసమయమున నెవనిప్రాణమును వాఁడు శ్రద్ధతోఁ ద్వరగాఁ గాచికోవలసినసందర్భములో నీచాత్ము లయినయుపకీచకులకు ద్రౌపదిని కట్లనుండి విడిపింపవలయునన్నతలంపంతసహజముగఁ దోఁచునదికాదు. కావునఁ దిక్కన తనయాంధ్రమునఁ దత్క్రమమును వ్యతిరిక్తముగాఁ జెప్పినాఁడు. ఇచ్చట నుపకీచకులు "ద్రుపదసూతిసమేతముగా నగ్రజుప్రేతము వైచి" పాఱుచుండ వాయుతనూభవుఁడు వారలను రూపడంచి వచ్చి పాంచాలీబంధమోక్షమును గావించె నని చెప్పియున్నాఁడు. ఇట్టి

మార్పువలన మానవస్వభావానుగుణత యలవడుటయేగాక తనభార్యను విడిపించుకొనుగౌరవము భీమునికే లభించుటవలన నౌచిత్యము ధ్రువపడినది.

(౮) కీచకసంహారమునకు నర్జునుఁ డేలపూనుకొనలే దనుటకు సమాధానము మూలమున "నతఁడు తిర్యగ్యోని నొందుటచేత" నని మాత్రము కలదు. తిక్కన యాంధ్రమున నిందు కద్భుతసుకుమార సమాధానము కానవచ్చుచున్నది. అర్జునుఁ డిట్లుపలుకుచున్నాఁడు:—

"క. నీతోడిపరిచయము లే
దే తలపోయఁగ ననింద్య వెందును నీ వి
ట్లాతుర వగుటకు నామది
నేతాపము లేదు నైజ మెఱుఁగవు కంటే."

అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరముఁ దాల్చినయంతియగాక, యూర్వశి యిచ్చినశాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవుగాకునికి గుప్తమై సాభిప్రాయంబుగాఁ దెలిపిన—

(౯) పాండవు లజ్ఞాతవాసమున నున్నకాలముననే దుర్యోధనుఁడు కౌరవసభలోఁ "బాండవులజాడలు వెదకి తెలిసికొనుతెఱంగులు మీమీయెఱింగినచందంబులు నాకుఁ దెలియంజెప్పుఁ" డని సభ్యుల నడిగినప్పుడు కర్ణుఁడు "పూర్వ మంపినవేఁగులవారికంటె నేర్పరు లగుచారులను మరల పంపి వెదకింప మంచి" దని యభిప్రాయము నొసంగెను. అట్టుపిమ్మట దుశ్శాసనుఁ డిట్లు పలికె నని మూలమున నున్నది:—

"యేషు నః ప్రత్యయో రాజం
శ్చారేషు మనుజాధిప।
తే యాం తు దత్తదేయా వై
భూయస్తాం పరిమార్గితుమ్."

(మనుజాధిపా! ఇప్పుడు మన కార్యము నమర్థించుకొని రాఁగల రని యేచారులపై విశ్వాసము గలదో వారలకుఁ గావలసినద్రవ్యము నొసంగి మరల వారిని వెదకఁ బంపుము.)

అనఁగాఁ గర్ణునివాక్యమె దుశ్శాసనునోటఁ బునరుక్తమైనట్లుగా మూలమునఁ జెప్పఁబడినది. ఇది దుశ్శాసనునిస్వాభిమానిత్వమునకును, వాని గాఢమైనగర్వాంధతకును నెక్కువయనుగుణముగ నుండఁజాల దని తిక్కన తనయాంధ్రమున

"చ. వలవదు రోయఁ బాండవుల వారొకయోజట లేనిత్రిమ్మటన్
బలమతి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియున్
మొలవదె యింత కిం కిట మనోముద మస్ఖలితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మన్నతిన్."

ఇయ్యది దుశ్శాసనునిపాత్రమునకు నుచితమైనరచనము గాదా?

(౧౦) దక్షిణగోగ్రహణసందర్భమును బురస్కరించుకొని విరాటుఁడు త్రిగర్తులపై దండయాత్ర వెడలుచుఁ దనతమ్మునితో "కంక వలలదామగ్రంథిగోతంత్రీపాలురు బాహుబలాఢ్యులును శూరులునుగఁ గన్పట్టుటచే వారును యుద్ధము చేయఁగల రని నావిశ్వాసము కావున వారికిని గవచాదుల నొసంగి యుద్ధోన్ముఖులను గావింపు" మని తెలుపఁగా వారికి నాతఁడు రాజాజ్ఞ నతిక్రమించి వారిని నాయుత్త పటిచె నని మూలమున నున్నది. ఇందు విరాటరాజు పాండవులసాహాయ్యమును గోరుట కొసంగఁబడినహేతువు దుర్బరముగాఁ గన్పట్టుటయుగాక యాత్మీయబలమునందు విశ్వాసము లేక తనయాశ్రితుల సాహాయ్యమునుగూడఁ గోరుచున్నాఁడా యనుసడికి గుఱి యగుట కూడఁ గన్పట్టుచుండుటచేతఁగూడఁ దిక్కన తనయాంధ్రమున నావిధముగఁ జెక్కనిమార్పు చేసినాఁడు. కంకభట్టు (ధర్మరాజు) భీమునకుల సహదేవుల నంతఁజూచి గని వారిని నిలుపుం డని నిష్ఫలముగా నిరా

గించి తాను 'మత్స్యభూనాథుని నల్లన సమీపించి యొకఋషి చేఁ దాను రణవిద్య నభ్యసించితి ననియు, వలలదామగ్రంథితంత్రీపాలు రను సమరంబునకుఁ బేరెన్నికఁ గాంచినవా రనియుఁ జెప్పి తన్నును వారిని యుద్ధమునకుఁ దోడ్కొనిపోవుట కాతని నియ్యకొల్పును. ఇయ్యది మూలానువాదనవిధానముల నెంత తారతమ్య మగుపించు చున్నదో వేఱుగ వక్కాణింపవలయునా?

(౧౧) చెఱఁగొఁ బట్టుకొనఁబడిన త్రిగర్తాధీశుఁ డగుసుశర్మను భీముఁడు ధర్మజునియాజ్ఞానుసారము విడిచిపెట్టె నని మూలమునం దున్నది కాని యుద్ధమునఁ బట్టువడినశత్రువును విడిపించుటకు రాజు నకుఁ దక్కఁ దదితరుల కేమియధికారముకల దని తలపోసి తిక్కన తనయాంధ్రమునం దీ విషయము నిట్లు మార్చివేసినాఁడు. యుద్ధమున వార లొనర్చినయుపకారమును బ్రశంసింపుచు మెచ్చుకొని "ఎద్దియేని కోరుఁ" డని యడుగ నప్పుడు ధర్మరాజు విరటునితో:—

"క. తగ నొక్కటి వేఁడెద నిను
జగతీశ్వర యిచ్చు టొప్పు సరథగజాశ్వం
బుగ విడిచిపుచ్చు మిప్పుడ
త్రిగర్తపతి నిదియ నాకుఁ బ్రియ మెబ్భంగిన్."

అని పలికి వానియనుమతిని గైకొని విడిచిపుచ్చెను. ఇం దెంతయు నౌచిత్యపోషణము గలదు.

(౧౨) ఉత్తరగోగ్రహణమున నుత్తరుఁడు తాను కౌరవసైన్య ముపై నెత్తిచనుటకుఁ దనకుఁ దగినసారథి లేఁడని విచారించునపుడు సైరంధ్రి వానితో సర్వవిధముల నప్పనికి బృహన్నల తగియుండు నని యాతనికి నమ్మికపుట్టఁ బల్కె నని మూలమునఁ గలదు. తిక్కన యాంధ్రమున నుత్తరునిపల్కులు విని ద్రౌపది యుత్తరయున్న యెడకుం బోయి బృహన్నలసారథ్యకౌశల మత్తెఱఁగ నెఱింగించి

యమ్మోదితయుఁ దానును జని యుత్తరున కత్తెఱంగు సముచితముగఁ జెప్ప నని కలదు. పాత్రౌచితీనిర్వహణమున నిచ్చటఁ దిక్కన మూల మునకు మెఱుఁగువెట్టె ననుట నిక్కము గదా ?

(౧౩) ఉత్తర సోదరసారథ్యమునకు బృహన్నలను బురిగొల్పుచు నీక్రిందిరీతిఁ బలికినట్లు మూలమున నున్నది.

"అద్వైతద్వచనం మే ద్యనియుక్తా నకరిష్యసి;
ప్రణయా దుచ్ఛమాసాత్వం పరిత్యక్ష్యామి జీవితమ్"

[మాయన్న నన్నుఁ బంపించి నీకుఁ జెప్పి నిన్నుఁ దోడ్కొనిరమ్మనఁగా నాకు నీయెడ నిండుకచనవు కలుగుటంజేసి యట్లు యని వచ్చితిని. నామాట వినక నన్ను సరకుగొనవేని నేను ప్రాణములు విడుతును.]

తిక్కనయాంధ్రమున నుత్తరవాక్యము : నీపాల నాకుఁ జనవు కలుగుటంజేసి యెల్లవిధంబులం దెత్తు నని పూని వచ్చితి. నీవును నా పలుకులు గుఱుచసేయక, నీపెంపునం బ్రకటముగా యుత్తరకుమారునకు రథంబుఁ గడప నియ్యకొని, యియ్యాపదఁ దలంగవలయును. అట్లొడంబడక తక్కుట నావలనివాత్సల్యంబు గొఱంతపఱుచుట."

ఇచ్చోట వచస్సౌకుమార్యమాధుర్యముల మాతృకాదుహితృ కలకు లోకములోఁ దల్లికిఁ గూఁతునికి నుండుభేదమె కానవచ్చుచున్నది.

(౧౪) మూలములో బృహన్నలకు "శుక్లవసనము" చెప్పి యుండఁగాఁ దెలుఁగున రణోచిత మైన "రక్తాంబరము" చెప్పఁబడి యున్నది.

(౧౫) అర్జునుఁడు నిజసోదరులను దన్నును నుత్తరున కెఱింగించుసందర్భమున మొట్టమొదటనే ("అహమస్మ్యర్జునః") ఏ నర్జునుఁడ నని చెప్ప మొదలుపెట్టినట్లు మూలమున నున్నది. తిక్కన తన యాంధ్రమున:-

"కంకుఁడు ధర్మసుతుఁడు వల
లాంకుఁడు భీముండు కవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁదొడఁగితి
నింకఁ గొఱంత వెట్ట నేల యే నర్జునుఁడన్."

ఇం దర్జునుఁడు సోదరులను ముందుగాఁ దెలిపి "చెప్పఁదొడఁగితి నింకఁ గొఱంత వెట్ట నేల" యని కడపట పేరు వెల్లడించుటయు మూలానువాదముల నౌచిత్యమునఁ గలతారతమ్యంబులు సుభోవృగాఁ దెలుపఁ గలదు.

(౧౬) ఉత్తరుఁడు కౌరవసైన్యముం గాంచి భయపడినప్పుడు సాయుధహస్తుఁ డైనయర్జునుఁ డుత్తరునం దట్టిభయముఁ బోఁగొట్టి నొగపైఁ గూరుచుండఁబెట్టి తాను రథియై కురుబలమును దఱుము సందర్భములోని మూలఘట్టము.

"మహారథ మనుప్రాప్తం దృష్ట్వా గాణ్డీవధన్వినమ్
అయం వీరాశ్చ శూరాశ్చ దుష్ప్రధర్షా స్తథైవ సంయుగే
ఏతద్ధ్వజాగ్రం పార్థస్య దూరతః ప్రతిదృశ్యతే
మేఘా సవిద్యుత్ స్తనితో రోరవీతి చ వానరః
ఆస్థాయ చ రథం యాతి గాణ్డీవం వికిపన్ ధనుః
అశ్వానాం స్తనితం శబ్దో వహతాం పాకశాసనమ్
రథస్యాంబుధర స్యైవ శ్రూయతే భృశదారుణః
దారయన్నివ తేజస్వీ వసుధాం పాసవాత్మజః
ఏవతిష్ఠన్ రథిశ్రేష్ఠో రథే రథిశతప్రణుత్."

తమకౌరవసైన్యమువంకకు వడిగా వచ్చుచున్నయర్జునునిరథధ్వాన మంతటను గ్రమ్మినది. కౌరవు లతనిపతాకాగ్రముఁ గాంచిరి. అతని రథధ్వానమును, దఱచు మొఱయు నతనిగాణ్డీవగుణరవమును వినిరి. అమ్మహారథుని యాగాణ్డీవధ్వనియు వినుపించుట గమనించి ద్రోణుఁ డిట్లు పలికెను.

"ఆదూరముగాఁ బ్రకాశించునది యర్జునుని కేతనాగ్రము. ఇది యాతని యరదముచప్పుడు. ఇట్లు భయంకరముగ గర్జించునది యతనిపతాకమునందలి వానరము. ఆవానరధ్వని మనసేనలనెల్ల సంక్షోభింపఁజేసినది. ఆరథశ్రేష్ఠము నధిష్ఠించియున్న యామహారథి కాగ్రణి మేఘగర్జాసన్నిభగాండీవధనుష్టంకారము చేయుచున్నవాఁడు."

ఇయ్యది మూలగ్రంథకారుని కూర్పు.

పూర్వార్థమున మొదట రథధ్వానము వినఁబడెనని, పిదప ధ్వజాగ్రము కనఁబడెనని, తరువాత గాండీవజ్యారవము వినంబడెనని వైశంపాయనుఁ డనుచున్నాఁడు. ఉత్తరార్థమున మొదట ధ్వజము గానఁబడెనని, యంతట రథధ్వానము వినంబడెనని, పిమ్మట గాండీవము నారిని ధ్వనింపఁజేయుచున్న యర్జునుఁడు రథమునఁ గూరుచుండి యుంటఁ గనంబడెనని ద్రోణుఁ డనుచున్నాఁడు. ఈవినఁబడుటలోను గనఁబడుటలోను గలవ్యాఘాతము లోకింత యటుండనిత్తము. ఇది దూరమునుండి దాదవ్వులఁ జేరవచ్చు రథగమనముయొక్క పరిణతి క్రమమా యనుప్రశ్నము పుట్టుచున్నది. వీరపురుషోచిత మైనశంఖా రావ మిందుఁ గానరాదు. దాని కేమి? అయ్యది యర్జునుని కేతనాగ్ర మని, యయ్యది తేరిచప్పు డని, యయ్యది యతనిధ్వజాగ్రమునందలి వానరగర్జ యని ద్రోణుఁడు విస్పష్టముగాఁ జెప్పుచున్నాఁడే! అది యుంగాక గాండీవధనుష్టంకారమును జేయుచు నతఁడు రథమునఁ గూరుచుండియున్నాఁ డని చూచి పలుకుచున్నాఁడే. ఇం దేమాత్ర మైన నేర్పరితనము గలదా? క్రమరీతి పాటింపఁబడియెనా?

ఇచ్చటఁ దిక్కనయాంధ్రమునందలి రచనాకౌశల్య మెట్లుం డెనో చూడుఁడు!

"శ్రవణపుటంబులు వ్రయ్యంగ దాఁకి సం
క్షోభంబు గావించె గుణముమ్రోఁత

బ్రహ్మాండభాండంబుఁ బగిలించి భూతని
శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె నుగ్రంపుఁబడగపఱపు;
మిఱుమిట్లు గొని చూడ్కి పఱవోవ వెలిఁగి ప
రిభ్రాంతి సేసెఁ గిరీటకాంతి;
తెల్ల మిది గాణ్డివంబును, దేవదత్త
మును, గపిధ్వజమును, వాసవునివరమునఁ
గన్నమకుటంబు నగు వేఱ కొన్ని యైన
నుజ్వాలాకృతభంగులై యున్నె యిట్లు!"

అల్లెత్రాఁటిమ్రోఁత మొదట, దాని వెంట శంఖధ్వని వినంబడెను. అంతటఁ బతాకాగ్రముమాత్రము, దానితోఁ గిరీటకాంతులుమాత్రము కనంబడెను. ఆయల్లెత్రాఁటిమ్రోఁత గాండీవముదే యని, యాచిందముమ్రోఁత దేవదత్తముదే యని, యాపడగపఱపు వానరాంకమే యని, యాకిరీటకాంతు లింద్రదత్త మగుమకుటప్రసారితమే యని వాని పావిత్ర్యములను వైలక్షణ్యములనుబట్టి యూహించి నిశ్చయించెను. ఇంకఁ జాలును. హృద్య మగు నీసందర్శనమును, గళాప్రవణతను నింత కన్న వాచ్యము చేయఁ గాదు. ఆకూర్పునకు నీకూర్పునకుఁ దఱుఁగు మొఱుఁగులు రసలుబ్ధుల కూహ్యంబులు గావా?

(౧౭) ద్రోణాచార్యుఁడు తనశిష్యుఁ డర్జునుఁడు తన కొసఁగు శరప్రయోగరూపసత్కారము నెఱుంగుసందర్భమున మూలము:-

"ఇమౌహి బాణౌ సహితౌ పాదయోర్మే వ్యవస్థితౌ
అపరౌ చాప్యతిక్రాంతౌ కర్ణౌ సంస్పృశ్య మే శరౌ."

(ఇతఁ డొక్కపెట్టున రెండుబాణముల నాపాదములఁ దాఁకునట్లును, రెండుబాణముల నా చెవులఁ దాఁకునట్లును వేసెను.)

ఇంకఁ దిక్కనయాంధ్రానువాదము:-

"ఇప్పుడు నాకుఁ బ్రణామంబుగాఁ బాదంబుల మొదలం బడ రెండమ్ము లేసి పెద్దకాలం బేనిపాసియున్నవాఁడు కావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం జోకములుగా రెండమ్ము లేసెను."

మూలము ననువదించుటలో "పాదంబుల మొదల", "చెవులు సోఁకియుంజోకములుగా" ననుట యెంతసాభిప్రాయమో, సుకుమారమో రసజ్ఞులే యూహించుకోఁగలరు.

(౧౮) అర్జునుఁడు కౌరవయోధులపై సమ్మోహనాస్త్రముం దక్క నన్యముం బ్రయోగింపకుండుటకుఁ గారణము మూలమునఁ గానరాదు. తిక్కన తనయాంధ్రమున నద్దానికిఁ దగినహేతువు నొసంగియున్నాఁడు.

"విజయుండు తనతోడంబుట్టువులప్రతిన లూహించి యొండు సేయనొల్లక, సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టందలంచి, సమ్మోహనాస్త్రంబు ప్రయోగించెను." ఇంతకంటె నుచితం బగుహేతువు మ తేమియుండును ?

(౧౯) అర్జునుఁడు సమ్మోహనాస్త్రముఁ బ్రయోగించినవెనువెంటనే శంఖమును బూరించినట్లును, నాభయంకరశంఖారావమునకు భీతిల్లి కురుప్రవీరులు మూర్ఛిల్లినట్లును మూలమునఁ గలదు. అయ్యది యప్రస్తుతమును, బ్రకరణప్రతికూలంబు నగుటచేఁ దిక్కన తనయాంధ్రమున విడిచిపెట్టినాఁడు.

(౨౦) అర్జునుఁడే విరాటరాజునకుఁ దనతోఁబుట్టువులతోఁ దన్నుఁదానే యెఱుకపఱచుకొన్నట్లు మూలమునఁ గలదు. సోదరులందఱు నచ్చట నేయున్నప్పుడు కిరీటి తన్నుఁదా నెఱిఁగించుకొనుట యనుచితము ననవసరము గావునఁ దిక్కన భీమునిచే నర్జునుని నెఱుకపఱచినాఁడు.

(౨౧) సంజయునిరాయబారముసందర్భము— ధర్మరాజు వాక్యము. మూలములో:-

"కర్ణశ్చ జానాతి సుయోధనశ్చ
ద్రోణశ్చ జానాతి పితామహశ్చ,
అన్యే చ యే కురవ స్తత్ర సన్తి
యథార్జునా న్నాస్త్యపరో ధనుర్ధరః
జానన్తి తత్కురవః సర్వఏవ
యే చాప్యన్యే భూమిపాలాః సమేతాః,
దుర్యోధనే రాజ్యమిహాஉభవద్యథా
హ్యరిన్దమే ఫల్గునే విద్యమానే
తే నానుబన్ధం మన్యతే ధార్తరాష్ట్రః
శక్యం హర్తుం పాణ్డవానాం మమత్వమ్
కిరీటినా తాళమాత్రాయుధేన
తద్వేదినా సంయుగం తత్రగత్వా
గాణ్డీవవిస్ఫారితశబ్దభాజా
వశృణ్వానా ధార్తరాష్ట్రా ధ్రియన్తే;
క్రుద్ధం నచే దీక్షతే భీమసేనం
సుయోధనో మన్యతే సిద్ధమర్థమ్.
ఇంద్రోஉప్యేత న్నోత్సహే త్తాతహర్తు
మైశ్వర్యం నో జీవతి భీమసేనే
ధనఞ్జయే నకులే చైవ సూత
తథా వీరే సహదేవే సహిష్ణౌ."

పైశ్లోకములలోనిభావమును జెదరనీయక యందలిసడలుబాటు నిందుఁ బొరయనీయక తనకూర్పునుగూర్చి సుప్రసన్నముగాఁ దిక్కనభావమును సాక్షాత్కరింపఁజేసినవిధమును జూడుఁడు.

"శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెఱుఁగరే పోరిట్టుఁ గయ్యంబు లా
శాపాశంబులు జుట్ట లా వెతఁగియుం జా వేడి మార్కొందు రిం
తే పో! తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతలం జేయుఁడే.

గాండీవజ్యారవం బుక్కుట మఱి యెలుచం గ్రమ్మినన్ భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్ శ్వే
దండద్వంద్వంబుమాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినన్ జా
ఖండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్."

పై నుదాహృతమూలమునకును దిక్కన తెలుఁగునకును గలభేద మొకింత యరయుదముగాక !

తిక్కన "కర్ణశ్చజానాతి........" అని మూలగ్రంథకారుఁడు వాచ్యము చేసినదానికి, సంక్షిప్తపఱిచి, భావమునకుఁ బుష్టిఁ గల్పించి వ్యంగ్యపూర్వకముగాఁ గవితాకళను సమర్థించినాఁడు. మూలగ్రంథకారుఁడు, కర్ణుని, సుయోధనుని, ద్రోణుని, భీష్ముని వరుసగాఁ జేర్కొనినాఁడు. కృపాశ్వత్థామలపే రెత్తఁడు. తొలుతఁ గర్ణునిఁ, బిమ్మట సుయోధనునిఁ, దరువాత ద్రోణభీష్ములను- నల్వురను క్రమపఱిచినాఁడు. దేనింబట్టి యీక్రమ మేర్పరించినాఁడు? అధికార్హతనుబట్టియా ? ఔచితినిబట్టియా ? జ్ఞానవంతులను జేర్కొనవలయునెడ ద్రోణభీష్ములఁ జేర్కొన్నతరువాత నెవ్వరినేనిఁ జేర్కొనఁదగును. సర్వ మెఱింగియుఁ దనపంతమే నెగ్గవలయు ననుసుయోధనుఁడు హఠయోగి; కర్ణుఁడో, రారాజుయడుగుజాడలననుసరించి తనకుఁదోఁచినట్లు సూటిగా నడచుకర్మయోగి; ఇట్టివారిని నెఱుకగలవారిలో మొదటఁ జెప్పుటయు, నిజముగా నెఱుకగలధర్మయోధులను ద్రోణభీష్ములను దరువాతఁ జెప్పుటయు నౌచితి యనఁబడునా ? ధర్మరాజు సంజయునితో వరుసగా నీనల్వుర నిట్లు నుడివె నని పురాణముల పుట్టు వెఱింగినబుద్ధిశాలురు వాదింపరు గదా. అర్హతను నధికారతారతమ్యములను నౌచితిని బాటించి కాఁబోలు తిక్కన ద్రోణభీష్ములతరువాతఁ గృపాశ్వత్థామలను, బిమ్మటఁ గర్మయోగిని గర్ణుని పదంపడి హఠయోగిని సుయోధనుని జేర్కొనినాఁడు. ఎఱుకగలపెద్దలను

వరుసఁబడి తెలిపి యెఱుఁగఁజాలని, నెఱుఁగనొల్లనివారి నిద్దఱను వాకొనినాఁడు. ఎప్పుడు, ఎక్కడ, ఎవ్వఁడు, ఎట్లుపేర్కొన్నను ద్రోణాచార్యునో, శాంతనవునో— ఇరువురిలోనొకరిని మొదల నిడి కృపాశ్వత్థామల నిద్దఱనో, యథవా యొకరినేని చెప్పి కడమవారిని వాకొనుచుఁ గ్రమభంగముఁ బొరయనీయక మరియాదఁ గాపాడువాఁడు తిక్కన. మూలగ్రంథకారుఁ డిట్లు పాటించుట గానరాదు చూడుఁడు.

“ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
ప్రాణము లాసుయోధనునిపాలివ యండ్రు......................”

అని రాయబారి సంజయునినోరను—

“భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు...............”

అని తత్తరపాటున నున్నయుత్తరునినోరను బలికించినాఁడు తిక్కన. ఇంతియగాదు— ఉత్తరగోగ్రహణమునఁ గురుసేనం జూపి జ్ఞప్తియుం చుకొనుటకై వేర్వేఱవరుస నర్జునుఁ డుత్తరకుమారునకుఁ దెలుపుచున్నాఁడు.

“కాంచనమయవేదికాకనత్కేతనో
జ్జ్వలవిభ్రమమువాఁడు కలశజుండు;
సింహలాంగూలభూషితనభోభాగకే
తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు;
కనకగోవృషసాంద్రకాంతిపరిస్ఫుట
ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు;
లలితకంబుప్రభాకలితపతాకావి
హారంబువాఁడు రాధాత్మజుండు;
మణిమయోరగరుచిజాలమహితమైన
పడగవాఁడు కురుక్షితిపతి; మహోగ్ర
శిఖరఘనతాళతరు వగుచిహ్నమువాఁడు
సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము.”

ఇందుసను దిక్కనకు మెలఁకువ గోల్పడదు. కలనికి మొనగాఁడు కలశజుఁడు (ద్రోణుఁడు), అతని వెనుక యశ్వత్థామయు, నాతరువాతఁ గృపుఁడును నిలిచినారు. ఆపిఱుంద రాధేయుఁడు, పిమ్మటఁ గురురాజు (దుర్యోధనుఁడు), దుముదారుదార గాంగేయుఁడు (భీష్ముఁడు). ఎత్తి పైఁబడవచ్చుశత్రువులనుండి తమరాజును రక్షించుకొనుటకై తమ్ముఁ గడచికాని దుర్యోధనుని సమీపింపకుండ ద్రోణకర్ణాదులు మొగాళమునను, భీష్ముఁడు వెన్నునను నిలిచినట్లు సంవిధానము. ఇది మూలము ననుసరించినదియు. పై సంఘటనమును మూలమాతృకతోఁ బోల్చి తిక్కనతీర్పరితనమును బఱితకు వదలుదము. మూలమున.—.

"గాండీవగుణరావము ధార్తరాష్ట్రు లింతదనుక వినలేదు గావున బ్రదికిరి. క్రోధావిష్టుని భీమసేనుని జూచునందాఁకఁ దనప్రాప్కని సుయోధనుఁడు విశ్వసించియుండఁగలఁడు." అని మరల "భీమార్జునులును, వీరుఁ డగునకులుఁడును, సహనశీలుఁ డగుసహదేవుఁడును సజీవులై యుండునంతవఱకు నింద్రుఁడేని మాప్రభుత్వమును హరింపఁగలఁడటయ్యా ?" అని యుధిష్ఠిరునినోరఁ బలికించినాఁడు. ఇందుఁ గవితాకౌశలం బెక్కడ? పూర్వార్థమున గాండీవజ్యారవమును గ్రోధమూర్తి భీమునిఁ బ్రశంసించితిమి, నుత్తరార్థమున నప్రయోజనకరమైన పునరుక్తికి స్థాన మెక్కడకలదు.

ఇంకఁ దిక్కనతీర్పరితనమును జిత్తగింపుఁడు.

"గాండీవజ్యారవము"తో మొదలుపెట్టి యర్జునునిపరాక్రమమును వ్యంగ్యముగా సూచింపుచు గదాదండమండితుఁ డగుభీముని బాహాదండశౌర్యమును దెలిపి, నకులసహదేవుల రణవిద్యాప్రవీణతను దెలిపినాఁడు. భావానుగుణముగను, సన్నివేశసముచితముగను వృత్తమును నడిపినాఁడు. నల్వురసోదరులబలపరాక్రమశౌర్యరీతులఁ గ్రమ

ముగాఁ బ్రకటించినాఁడు. తొలుత గాండీవజ్యారవము పలుమఱు నుత్కటముగాఁ గ్రమ్ముటయుఁ, బిమ్మట బాహాదండ మేపాఱి శంఖ ద్గద జడిపింప, భీముని రౌద్రాకృతి దోఁచుటయు, పదపడి యేన్గులజోడువలెఁ దఱుమునకులసహదేవులఁ దాఁకుటయుఁ జూపినాఁడు. అర్జునుఁడు శ్రవణమాత్రభయంకరుఁ డని, భీముఁడు దర్శనమాత్రభయంకరుఁ డని, నకులసహదేవులు సంఘర్షణమాత్రభయంకరు లని తారతమ్యములను వ్యక్తీకరించినాఁడు. ‘‘క్రమ్మినన్’, ‘తోఁచినన్’, ‘‘తాఁకినన్’’, అని ధ్వని ప్రసాదించి మెఱుఁగువెట్టినాఁడు. ఇట్టి పట్టుల నెన్నేనిఁ జూపవచ్చును.

(౨౨) స్వర్గారోహణము. మూలము:—

‘‘వైశంపాయన ఉవాచ:—

‘‘స్వర్గం త్రివిష్టపం ప్రాప్య తవ పూర్వపితామహాః;
యుధిష్ఠిరప్రభృతయో యదకుర్వత తచ్ఛృణు
స్వర్గం త్రివిష్టపం ప్రాప్య ధర్మరాజో యుధిష్ఠిరః;
దుర్యోధనం శ్రియా జుష్టం దదర్శాసీన మాసనే
భ్రాజమాన మి వాదిత్యం వీరలక్ష్మ్యాభిసంవృతమ్
దేవై ర్భ్రాజిష్ణుభిః సాధ్యైః సహితం పుణ్యకర్మభిః
తతో యుధిష్ఠిరో రాజా దుర్యోధన మమర్షితః
సహసా సన్నివృత్తోఽభూ చ్ఛ్రియం దృష్ట్వా సుయోధనే.’’

‘‘యుధిష్ఠిరుఁడు స్వర్గమున నడుగిడెను; ఐశ్వర్యసమగ్రుఁడై సింహాసనాసీనుఁడైనదుర్యోధనుని గాంచెను. ఆదుర్యోధనుఁడు సూర్యునట్లు ప్రకాశించుచు వీరపురుషసత్వ మగుకీర్తిలాంఛనము ధరించియుండెను. అతఁడు దివ్యతేజస్సంపన్నులు, శుభకర్మకరులు నగుసిద్ధాదిదేవతలం గూడియుండెను. దుర్యోధనుని, నతనియైశ్వర్యమును జూచి యుధిష్ఠిరుఁడు కోపోద్రిక్తుఁడై తనదృష్టిని మఱల్చెను.’’ యుధిష్ఠిరుఁడు స్వర్గమున నడుగుఁబెట్టఁగానే యుత్తమవీరస్థుఁడు నైశ్వర్యసమగ్రుఁడు నైన

దుర్యోధనుని గనె నని వైశంపాయనునిచేఁ బలికించి "సూర్యప్రభా కలిత........" అని చెప్పించెను. ఆద్యంతములయందు దుర్యోధనుని పేరు రెట్టించిచెప్పించెను. ఇందు నేర్పు పెంపు గానంబడదు. కవితాగానకళల జీవమంతయును నెత్తుగడయందును, దీఱుగడయందును నిక్షిప్తమై యుండనొప్పును. పైఁజెప్పిన యుక్తివాచ్యము. ఇంక నిటఁ దిక్కనతీర్పు గనుఁడు.

"..............కట్టెదురఁ బోఁచెఁ
నున్నతాసనాసీనుఁ డభ్యుదితసరసి
జాప్తసంకాశుఁ, డమృతాశాంగనాది
వృతుఁడు, వీరలక్ష్మీవిరాజితుఁడు, సతత
యుక్తసుఖసాధనుండు దుర్యోధనుండు."

కనఁబడె నని ప్రారంభించి, యామహావైభవ మంతయు నెఱింగించి చివరకు పేరు వెలువరించినాఁడు. తిక్కన కవితిలకుఁడు. ఇది తీర్పు నేర్పు కాదా ?

మూలగ్రంథకారుఁడు వ్యాసుఁడైనను, మఱి యెవ్వఁడైనను మూలగ్రంథకారునిచూపునకును దిక్కనచూపునకు నెంతవ్యత్యాసము గలదో స్థాలీపులాకన్యాయముగ నొక్కవిషయము నిచ్చట మూదవించినఁ జాలును.

ఈస్వర్గారోహణమునను మూలగ్రంథకారుఁడు (వ్యాసుఁ డగుఁ గాక; కాకపోవునుగాక) ధర్మరాజును "యుధిష్ఠిరుఁ" డని పెక్కెడల వాడుచువచ్చినాఁడు. తిక్కనమట్టుకు నీపర్వమున నెక్కడను నాశబ్దమునకుఁ జోటిచ్చినవాఁడుగాఁడు. యుధిష్ఠిరత్వమునకు నీస్వర్గభూమి స్థానము గాదని, సమయము గాదని తిక్కనకవి బాగుగా నెఱుంగును. ఇక్కడనేకాదు, ఏపట్టుననేని తిక్కన పదప్రయోజనము నెడఁ బ్రజ్ఞ కోల్పడె నని చెప్ప నయితికాదు. స్థానమును, సమయమును గమనింపక మూలగ్రంథకారుఁ డిచ్చవచ్చినట్లు వాడినాఁడు.

